## చిత్రకారుని గురించి



యూజిన్ డిలాక్రోక్స్

యూజిన్ డిలాక్రోక్స్ (Eugene Delacroix) (1798-1863) ఫ్రెంచ్ కాల్పనిక యుగానికి చెందిన అత్యుత్తమ, ఉన్నత కళాకారుడు. అందరికీ తెలిసిన రూమరు ప్రకారం అతడు, ప్రఖ్యాత రాజనీతిజ్ఞుడు టాలెయ్‌రాండ్‌కు జన్మించిన అక్రమ సంతానం. యువకళాకారుడుగా అతడు ప్రభుత్వం నుంచి అసాధారణ సహాయాన్ని పొందాడు. ఆ సహాయాన్ని చూసేవారికి ఎవరికైనా వెనుక రహస్యంగా ఉండి సూత్రాలను కదుపుతున్నాడేమో అని అనిపిస్తుంది. ఫ్యాషన్‌బుల్ సర్కిల్స్‌లో ఎక్కువగా తిరిగేవాడు. అక్కడ అతనికి మంచి డిమాండ్ ఉండేది - అయితే అతడి మంత్రముగ్ధ రూపం వెనుక మండే కోర్కెల నిప్పుగోళం ఉండేది.

అతడు వార్షిక ప్రదర్శనలకు విశాలమైన కాన్వాసుల మీద చిత్రించేవాడు. అతడి చిత్రాలలోని రాజీపడని విషయం (Subject Matter) విమర్శకులను బెంబేలెత్తించేది. అతని అనేక కళాఖండాలను ప్రభుత్వమే కొనుగోలు చేసింది.

అతడి జీవితంలోని చివరిమూడు దశాబ్దాలలో మతసంబంధమైన భవనాల మీద కుడ్య చిత్రాలు వేశాడు. తనకై తాను విధించుకొన్న ఏకాంతవాసంలో అతడు 65వ యేట కనుమూశాడు.

ఇతనిది ద్వంద్వమూర్తిమత్వం. పైకి కనిపించే సౌమ్య మంత్రముగ్ధ రూపం వెనుక అంతర్గతంగా హింస, క్రౌర్యాలు ఉన్నాయి. ఈ రెండు మూర్తిమత్వ లక్షణాలు అతడి పెయింటింగ్స్‌లో కనిపిస్తాయి. పైకి పులి చాలా అందంగా ఉంటుంది, కాని అది క్రూర మృగం. అందుకని అతడిని స్నేహితులు పులితో పోల్చేవారు.

### ముఖచిత్రం : గ్రీసు బాధ

స్వేచ్ఛకోసం గ్రీకుల ఉద్యమం, స్వాతంత్ర్య సమరంలో గ్రీసు బాధాతప్త అనుభవాలు. ఈ ఉద్యమం ఐరోపా కళాకారుల, మేధావుల సానుభూతిని పొందింది. డిలాక్రోక్స్ చిత్రించిన ఈ చిత్రం ప్రతీకాత్మకంగా అతని కోపాన్ని దిగ్భ్రాంతిని వ్యక్తం చేస్తున్నది.

**మూడవ, నాల్గవ అట్టలపై చిత్రాలు కూడా వీరివే.**

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 14 ఆగస్టు 2003 సంచిక 8

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయ సూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **గ్రీసు బాధ**

చిత్రకారుడు : **యూజిన్ డిలాక్రోక్స్**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Tips for good writing

A pen is said to be mightier than sword. That's because a pen in the right hands can be the most powerful tool for fighting injustice, for drawing a line between right and wrong, for discriminating between good and bad; but can take a nasty turn for the worse in the wrong hands.

Writing is an art which dates back to the earliest days of human civilisation and since then it has been modified to a great extent which now stands as contemporary English writing in its latest form. It is usually seen that not only the contents of what we read, but also the style of writing exercise a great influence on us. For e.g. an article written in a monotonous style will not appeal to us as much as the one with variations. It therefore becomes necessary for a writer to have his/her writing create a good impression on the readers.

If one wants to become a good writer, one shouldn't expect an overnight miracle. Writing is a creative skill that needs lot of time to develop, though some of us have a natural flair for it.

So, here are some tips which will help you improve your writing skills if you are really bent on becoming a good writer.

⇨ Read a lot of classics and contemporary writings, including newspapers and magazines, specially the editorial columns.

⇨ Always write in the active voice.

Avoid phrases that use too many commas.

⇨ Use shorter sentences.

⇨ Write an interesting first paragraph that broadly outlines the goal and theme of the writing. In successive paragraphs develop those themes introduced in the first. This technique provides the reader with important information quickly and efficiently (in journalism, this technique is referred to as the "inverted pyramid")

⇨ Read your writings aloud. If you can't read a sentence without gasping for breath, it is too long. Moreover, listen to yourself and assess your style.

⇨ Think of every possible way to improve your writing – change the style or think of isolated words.

⇨ Avoid using the same words (specially verbs and nouns) in the same sentence or paragraph (refer to a Thesaurus if necessary).

⇨ Scrutinise each paragraph and revise it until it is looks good. Paragraphs are good when they say what you want it to say.

⇨ Make sure that the paragraphs fit together nicely.

⇨ Quotations should be used sparingly; do not use someone else's words without quotation marks and proper citation. Remember plagiarism is a crime.

⇨ Do not use contractions in serious writings (e.g. can't, don't).

⇨ Be very particular about spellings and punctuation marks.

*(With inputs from the Net)*

**ANJUM PARVEEN,** Saifee Hall

# అధి వాస్తవిక కళా - అచేతనమూ

- అన్నపరెడ్డి వెంకటేశ్వరెడ్డి

20వ శతాబ్దిలో వచ్చిన అత్యంత ముఖ్య ప్రతిభావంతమైన కళా, సాహిత్య ఉద్యం అధి వాస్తవిక వాదం (surrealism). ఈ ఉద్యమానికి వేళ్ళు వియన్నా సైకో ఎనలిస్ట్, ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మూర్తిమత్వ సిద్ధాంతంలోని ఇడ్ (it= అది) లో ఉన్నాయి. ఫ్రాయిడ్ ప్రకారం మనిషి మూర్తిమత్వం ఇడ్, ఈగో, సూపర్ ఈగోలనే మూడు అంశాలతో నిర్మితమవుతుంది. ఇడ్ పూర్తిగా అచేతనం. ఇది లిబెడో అనే లైంగిక శక్తితో నిండి ఉంటుంది. మనిషికి ప్రచోదక శక్తి ఇదే. ఇది సుఖసూత్రం (pleasure principle) ప్రకారం నడుస్తుంది. దీని ప్రవర్తన రీతి రహితం, అహేతుకం, అసంబద్ధం, ఇటువంటి ఇడ్ నుంచి ఊపిరితీసుకొంది ఈ అధి వాస్తవిక వాదం.

ఈ అధి వాస్తవిక వాదాన్ని మొట్టమొదట ప్రారంభించిన వాడు ఆంద్రీబ్రెటన్. ఈయన అధికారికంగా 1924లో ఫ్రాన్స్‌లో దీనిని ప్రతిపాదించాడు. ఈ వాదం ఆశయాలకు ఆశంసలకు రూపకల్పన చేస్తూ ఒక విధాన ప్రకటన చేశాడు. ఈ ఉద్యమం వెంటనే ఉత్తర, దక్షిణ అమెరికాలకు, ఐరోపాలో కొన్ని ప్రాంతాలకు వ్యాపించింది.

ఈ అధి వాస్తవికవాదం అనేక విధాలుగా అంతకుముందు ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో ఆవిర్భవించిన 'డాడా' వాదానికి పుత్రిక అని చెప్పవచ్చు. డాడా వాదం అంటే యాదృచ్ఛిక, అహేతుక వాదం అని చెప్పవచ్చు. అదృష్ట, యాదృచ్ఛిక, అహేతుక, అసంబద్ధ సంఘటనలను, విషయాలను వస్తువులుగా గ్రహించి కళావస్తువులుగా ప్రదర్శిస్తుంది. అర్థరహితంగా అక్షరాలను ఎలా పడితే అలా ఏరుకొని పెద్దగా చదివితే అది కవిత్వమే ''కాదేదీ కవిత కనర్హం.'' వార్తా పత్రికల నుంచి చించిన ముక్కలను యధేచ్ఛగా అతికి అదే పద్యమంటారు. ప్రాయికంగా మానవుడు హేతువాది అని హేతువాదులంటుంటే, వీరు మనిషి అహేతుక వాది అంటారు. అసలు వీరు తమ వాదానికి డాడా యిజమ్ అని పేరు పెట్టడమే విచిత్రంగా ఉంది. వీరు డిక్షనరీని తెరవగానే ఏ పేజీవస్తే, ఆ పేజీలో ఒక చోట పెన్సిల్‌ములుకు ఉంచినప్పుడు, ఆ పెన్సిల్ ములుకు ఏ పదాన్ని సూచిస్తే ఆ పేరు పెట్టాలనుకొన్నారు. ఆ పద్ధతి అవలంబించినప్పుడు పెన్సిల్ 'డాడా' అనే పదం మీద పడింది. ఆ పదాన్నే వారు తమ ఉద్యమ నామంగా స్వీకరించారు.

'డాడా' అంటే బొమ్మ గుర్రం అని అర్థం.

అసలు వీరు ఇలాంటి ఉద్యమాన్ని ప్రారంభించడానికి కారణం మొదటి ప్రపంచ యుద్ధంలో జరిగిన మహా వినాశం, ప్రాణనాశం. ఇలాంటి మహా వినాశం జరిగిందంటే ఈ ప్రపంచంలో హేతువు ఉందంటారా? దాని సంస్కృతి మంచిదేనా? అలాంటి వినాశకర స్థితికి నెట్టుకువెళ్ళిన సంస్కృతి ముఖాన, అటువంటి మానవాళి ముఖాన ఉమ్మి వేయాలన్నారు. అలా దీనికి పూర్తిగా విరుద్ధమైన అహేతుక, యాదృచ్ఛిక వాదాన్ని చేపట్టారు. ఒక విధంగా దీని నుంచి, ఫ్రాయిడ్ ఇడ్, ఈగోల మధ్య సంబంధం నుంచి అధి వాస్తవిక వాదులు స్ఫూర్తిపొందారు.

ఇక్కడ ఇడ్, ఈగో సంబంధం గురించి కొంత చెప్పాలి. ఇడ్ అచేతనమని, మన ప్రాథమిక ప్రచోదనలకు వేదనలకు, సహజాతాలకు నిలయమని చెప్పుకొన్నాము. మరి ఈగో (అహం)

హేతువును, సంస్కృతిని ప్రతీకీకరిస్తుంది. ఇడ్ నుంచి వచ్చే ప్రాథమిక మొరటు (సమాజం అంగీకరించని) వాంఛలను హేతువుకు సంస్కృతికి ప్రతీక అయిన ఈగో అణచివేస్తుంది. ఇడ్ వాంఛలు అచేతనం గనుక మనకు మామూలుగా తెలియవు. ఒకవేళ ఆ అచేతన వాంఛలు యధాతథంగా బయటకు వస్తుంటే వాటిని ఈగో (reason) అడ్డుకొంటుంది. అణచి వేస్తుంది. అవి అచేతనంలోకి పోతాయి. మనం ఆ అచేతన వాంఛలను ఎంతగా అణచినా, అవి ఎలాగో ఒకలాగ బహిర్గతమవుతాయి. మన చేతన మనస్సు ఏమరిలి నప్పుడు, దాని పట్టు తప్పినప్పుడు, అవి కలల రూపంలో, పురాణాల, విచిత్ర ప్రవర్తన రీతుల, నోరు జారడం, ప్రమాదాల, కళారూపాలలో అభివ్యక్తమవుతాయని ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించాడు.

స్వప్నం అలాంటి అచేతనంలోకి తొంగి చూడడానికి రాచబాట అన్నాడు. అచేతనంలోకి చూడడానికి అధి వాస్తవిక వాదులు మార్గం కనుగొన్నారు. అదే వారి కళా రూపాలు.

స్వప్న విషయం అచేతనం నుంచి బయటికి వచ్చేటప్పుడు ఈగో అడ్డుకొంటుంది. ఇడ్‌కి, ఈగోకి ఆధిపత్య పోరు జరుగుతుంది. ఇద్దరిలో ఎవరూ గెలవకనే ఒక రాజీరూపంలో స్వప్నంలో బయటికి వస్తుంది. అందుకే కలలు అంత పిచ్చి పిచ్చిగా, కదా కారంగా, అర్థరహితంగా, గందరగోళంగా ఉంటాయి. ఇది ఫ్రాయిడ్ చెప్పింది.

ఈ స్వప్నాలలో ఉండే అర్థరాహిత్యాన్నే అధి వాస్తవిక వాదులు తమ కళారూపాలకు ఆలంబనం చేసుకొన్నారు.

ఈ కళాకారులలో ముఖ్యులు స్పానియార్డ్ సాల్వడార్ డాలీ, బెల్జియమ్స్ రెనెమార్గరిటె, పాల్‌డాల్ వాక్స్‌లు.

స్వప్నంలో ఉండే అహేతుకతను తమ కళా రూపాలలో సూచించడానికి వారు హేతుబద్ధ వస్తువులను ఒకదాని సరసన మరోదానిని అహేత పద్ధతిలో అమర్చారు. 'కొలనులో సిగరెట్టు పెట్టె' ఈ రెండింటికి ఏ సంబంధం లేదు. అలాగే అరికాలిలో కన్ను. మనకు అక్షపాదుడున్నాడనుకోండి. - పురాణంలో - పురాణాల్లో చిత్రాలు చాలవరకు అహేతుకాలు. హనుమంతుడు ఈగై, లంకిణి పొట్టలో దూరతాడు. పురాణాల్లో ఏది ఏమైన అవుతుంది. విష్ణువు బలి చక్రవర్తి నెత్తిన కాలు పెడతాడు - విశ్వం అంతాచాలక. ఇలా పురాణ చిత్రాలు అధివాస్తవిక కళకు ఉదాహరణలే. ఇలా పురాణాలు రావడానికి మానవుని ఈగో అప్పటికి అంతగా వికసించలేదు. అందుకనే ఇడ్ నుంచి యధేచ్ఛగా వాంఛలు కట్టలు తెంపుకు వచ్చాయి. మరి ఈనాడు ఈగో చాలవరకు విస్తరించింది, కనుక పురాణ రచనను ఎవరూ చేయలేరు.

మార్గరిటె చిత్రించిన ''సుఖం'' (pleasure 1927)లో ఒక ఆడపిల్ల సజీవులైన పిట్టలను పట్టి పళ్ళతో కొరికి తింటుంది. ఈ చిత్రం మానవ క్రౌర్యాన్ని తెలుపుతుంది. మరో విషయం: చిత్రానికి పెట్టిన పేరు, బొమ్మకు మధ్య ఉన్న విరోధం అంటే సుఖం - క్రౌర్యం.

సాల్వడార్ డాలీ చిత్రాలు చూసే వానిని బట్టి, పండ్లున్న ప్లేటు ముఖంలా కనిపిస్తుంది. ఒక బ్రిడ్జి ఒక కుక్క కాలర్‌గా, సముద్రపుటొడ్డు టేబుల్ క్లాత్‌గా దర్శనమిస్తాయి.

అధి వాస్తవిక శిల్పులు ''ఒక వస్తువు రూప స్వాభావాలను, మరో వస్తువు రూప స్వభావాలుగా మార్చడం'' అనే ఉపాయం ద్వారా ఈ వాదాన్ని స్వీకరించారు. స్విస్ ఆర్టిస్ట్ ఓపెన్‌హైమ్ ''ఆబ్జెక్ట్'' (వస్తువు) బొచ్చుతో టీ కప్పు, సాసరు, స్పూన్‌లను చేసి పెట్టాడు (Breakfast in Fur, 1936, Museum of Modern Art, Newyork City) చూచేవానికి తాను ఆ కప్పుల నుంచి త్రాగుతున్న భావన కలిగేట్టుగా.

చాలా మంది అధి వాస్తవిక వాదులు పురాణాల మీద ఆసక్తి చూపారు. ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం అయితే, అంతర్గతంగా మనో వైజ్ఞానిక స్థిరీభవనాలు (Psychological fixations) వాంఛలను బహిర్గతం చేస్తాయని భావించబడింది. మొదట్లో ఫ్రాయిడ్ అనుయాయి, ఆ తరవాత ఆయన నుంచి చీలి పోయిన కారల్‌గూస్టాఫ్ యూంగ్ (Jung) అనే స్విస్ మనో వైజ్ఞానికుడు ఏమాత్రం పోలికలు లేని సంస్కృతులలో గూడ అదే రకం పురాణకథలు (Myths) కనిపించాయన్నాడు. సంస్కృతులు అంత భిన్నంగా ఉన్నప్పుడు ఒకే రకం (పోలికలున్న) పురాణ కథలు ఎందుకు రూపొందినట్లు?

దీనికి సమాధానం ఆయన ప్రతిపాధించిన ''ఉమ్మడి అచేతనం (collective unconscious) లో చూడమన్నాడు. వ్యక్తిలో రెండు రకాల అచేతనలుంటాయి. ఒకటి ఫ్రాయిడ్ ప్రతిపాదించిన వైయక్తిక అచేతనం (individual unconscious). రెండోది దీనికంటె లోతైనదీ, మానవజాతికే సామాన్యమైనదీ అయిన యూంగ్ ప్రతిపాదించిన ఉమ్మడి అచేతనం. ఈ అచేతనంలో మానవజాతి శైశవ దశల నుంచి పొందిన అనుభవాలు నిక్షిప్తమై ఉంటాయి. యూంగ్ కొన్ని మూల రూపాలను (arcue types) చెప్పాడు. పేదరాసి పెద్దమ్మ, జ్ఞాని (wiseman) సీత, హెలెన్, ద్రౌపది లాంటి రూపాలు మానవ జాతిలోని అనేక సంస్కృతులలో కనిపించే మూల రూపాలు.

స్వప్నాలు స్వాపి (dreamer) అహేతుకతను ప్రదర్శిస్తే పురాణ కథలు మానవాళి మనోవిజ్ఞానాన్ని ప్రదర్శించాయి.

సాల్వడార్‌డాలీ ''నారసిసస్ రూపాంతరీకరణం'' (Metamorphosis of Naracissus, 1934, Tate Gallery, London) అనే చిత్రంలో గ్రీకు పురాణ నాయకుడు నారసిసస్ తనను తాను ప్రేమించుకోవడాన్ని చిత్రించాడు. దీనిని స్వానురాగ (self-love) అంటారు. గ్రీకు పురాణంలో ఈ కథ ఇలా ఉంది: 'గ్రీకు పురాణ నాయకుడు దప్పికతో స్వచ్ఛమైన నీరున్న కొలను దగ్గరకు వెళతాడు. నీరు త్రాగడానికి దానిలోకి తొంగి చూస్తాడు. ఆ స్వచ్ఛమైన నీటిలో తన ప్రతిబింబాన్ని చూసి, దానిని మోహించి, కౌగిలించుకోబోయి, కొలనులో పడి చనిపోయి అందమైన పువ్వుగా మారిపోతాడు. ఆ పువ్వు పేరు నారసిసస్. ఈ పూవు పేరుతో నేటికీ అత్తరులు తయారు చేసి అమ్ముతుంటారు.

గ్రీకు పురాణ కథలు అధివాస్తవిక వాదులను ఆకర్షించడానికి కారణం ఆ పురాణాలలో ఒకటి మరొకటిగా మారి పోవడం. హిందూ పురాణాలు అంతే. అయితే మన హిందూ పురాణ కథల ఆధారంగా అధివాస్తవిక పెయింటింగులో ఎక్కువగ రాలేదేమో.

అలాగే డాలీ పెయింటింగ్ ఒకటి మొదట మానవ శరీరంగా కనిపిస్తుంది. దానినే మరో కోణం నుంచి చూస్తే ''ఒక చేయి గుడ్డను పట్టుకొన్నట్లు'' ఉంటుంది.

పురాణ గాథలు అధివాస్తవిక వాదులను ఆకర్షించడానికి మరోకారణం, వాటికి పాశ్చాత్యేతర సంస్కృతుల్లో ఎంతో ప్రాముఖ్యం ఉంది. పాశ్చాత్య సంస్కృత ప్రాథమిక ప్రకృతికి విడాకులిచ్చే ప్రమాదంలో పడిందని ఫ్రాయిడ్ భయపడ్డాడు. ఎరిక్ ఫ్రామ్ అలాగే భావించాడు. పాశ్చాత్యేతర సంస్కృతులు ప్రకృతితో సంలీనమైనాయి. ఆ ప్రాకృతిక శక్తులు వారి పురాణాలలో అత్యంతంగా అభివ్యక్తమయ్యాయి.

ఆల్బర్టో జియా కొమెట్టె అనే అధివాస్తవిక వాద స్విస్ శిల్పి ''గరిటె స్త్రీ'' (Spoon Woman, 1926, Museum of Modern Art, Newyork City) చిత్రాన్ని చిత్రించాడు. ఇందులో గరిటె గుండ్రని స్త్రీ ఆకృతిని ప్రతిబింబిస్తుంది. అంతేకాదు లిబేరియా, కోటెడి, ఐవోరీలు అనే ఆర్టిస్టుల గరిటెలు, తెడ్లు మానవాకృతిని బోలి ఉన్నాయి.

అచేతన ''ప్రతిమాత్మకాలోచన''ను బహిర్గతం చేయడానికి వీరు పన్నిన ఒక పన్నుగడ ''సుందర మృత కళేబరం'' (exquisite corpse). ఈ సంయుక్త కళా రూపంలో ఒక కాగితాన్ని నాలుగు మడతలు వేసి, ఒకరికి తెలియకుండ మరొకరు, నలుగురు కళాకారులు, ఒక్కో మడత మీద ఒక్కొక్కరు, ఒకరు వేసిన దానిని మరొకరు చూడకుండ, మానవ దేహాన్ని వేస్తారు. మొదటి వాడు తలను వేసి కాగితాన్ని మడచి రెండోవానికిస్తాడు. ఇతడు మొండెం గీసి, కాగితాన్ని మడిచి మూడోవాడికిస్తాడు. అతడు కాళ్ళను, నాలుగో వాడు అదే పద్ధతిలో పాదాలను వేస్తాడు. అప్పుడు కళాకారులు కాగితాన్ని విప్పి, సంయుక్త చిత్రాన్ని అధ్యయనం చేసి వ్యాఖ్యానిస్తారు.

మాక్స్ ఎర్నెస్ట్ అనే జర్మన్ అధివాస్తవిక కళాకారుడు మరో ఉపాయాన్ని (technique) కనుగొన్నారు. ఈ పన్నుగడ అదృష్టాన్ని, యాదృచ్ఛికతను ఉపయోగించుకొంటుంది. ''రుద్దుడు'' (ఫ్రెంచ్ భాషలో (frottage = rubbing) కాన్వాసు అడుగున గరుకు చెక్కనో, లోహపు పలకనో ఉంచి, కాన్వాసు మీద పెన్సిల్‌తో రుద్దడం కాని, పెయింట్‌చేయడం కాని చేస్తారు. దీనితో కాన్వాసు అడుగున వుంచిన వస్తువు గరుకు (texture) చిత్రంలో భాగమై కూర్చొంటుంది.

Laoloon, Father and Sons (1926, Menil collection, Houston, Texas) చిత్రంలోకి ఎర్నెస్టు ''యాదృచ్ఛిక గరుకు'' (chance textures)ను ''రుద్దుడు'' ద్వారా ఎక్కించాడు. అలా ''గరుకుల''ను ఎక్కించడంతో పాటు ఈ చిత్రం గ్రీకు పురాణంలో కొండ శిలువలతో పోరాడిన ట్రోజన్ పూజారి లావొకూన్ కథను గూడ సూచించింది.

అచేతన విషయాలను బహిర్గతం చేయడానికి అధి వాస్తవిక కళాకారుడు వాడిన మరో ఉపాయం స్వయం చాలకత (automatism). పెయింటింగ్‌లో స్వయం చాలకత అంటే చేతిని కాన్వాసు మీద యథేచ్ఛగా యదాలాపంగా, చేతనం ఏమాత్రం జోక్యం చేసుకోని రీతిలో పరిభ్రమింప జేయడం. ఫలితంగా ఏర్పడిన గుర్తులు ( గీతలు వగైరా) యాదృచ్ఛికాలు కావు. అంతకంటె అర్థ రహితాలూకావు. ప్రతి దశలోని ఆ గుర్తులు, గీతలు కళాకారుని అచేతనం నిర్దేశానికి ఫలితాలు అని వారు విశ్వసించారు.

ఇటువంటి టెక్‌నిక్‌ను ఫ్రెంచ్ పెయింటర్ ఆంద్రేమాసన్ "The kill" (1944 Museum of Modern Art, Newyork City)లో ఉపయోగించాడు కాని ఆ తరవాత కొన్ని గీతలు అలవోకగానే

గీసి దాని విస్తరీకరణకు పునాది వేశాడు. అలా వేసిన చిత్రాలలో వాస్తవ వస్తువుకు ఏ మాత్రం సాదృశ్యం ఉన్నా ఆ సంబంధాన్ని విస్తరింప చేయడానికి మెరుగులు దిద్దేవాడు. (ఈ చిత్రంలో ముఖం లేదా శరీర భాగం) ఆంద్రీ మాసన్ చిత్రీకరణకు ముందు పలాన వస్తువును చిత్రించాలని ముందుగా నిర్ణయించుకో లేదు గనుక, తరవాత చేసే మార్పులు చేర్పులు అతడి సృజనాత్మక స్థితిలోని ఔద్వేగిక ప్రేరణ ఫలితాలే అన్నారు మిగతా ఆర్టిస్టులు.

స్వయంచాలకత (automatism) టెక్నిక్‌ను ఉపయోగించిన మరో పెయింటర్ స్పెయిన్ దేశస్థుడు జాన్‌మిరొ. ఉదాహరణకు అతడిదే అయిన "In the Birth of the World" (1925, Museum of Modern Art, Newyork city) అనే చిత్రంలో, మిరొ రంగులను యాదృచ్ఛికంగా (chance) కాన్వాసు మీద పోసి, వాటిని గురుత్వాకర్షణ శక్తితో కారనిచ్చాడు. ఫలితాలు అద్భుతం, తను వాటిలో ముందుగా ఏదీ ఊహించింది కాదు. మాసన్‌లాగే ఇతడు పెయింటింగ్‌ని రెండో దశలో ఉద్దేశపూర్వకంగానే దిద్దేవాడు. మొదట కాన్వాసు మీద పడిన రంగు చారల మీద తదేక ధ్యానాన్ని నిలిపి పరికించేవాడు. అలా చూడడంతో ఏవో అతనికి అర్థాలు, ప్రతిమలు తట్టేవి. అప్పుడు వాటికి ఆకృతులను, జీవులను పోలిన వాటికి దగ్గరగా ఉరిడేట్టు కలిపేవాడు. ''ప్రపంచం పుట్టుక'' శూన్యం నుంచి ప్రపంచం పుట్టినట్లు సూచిస్తుంది. అంతేకాదు, చిత్రీకరణ ప్రక్రియలోంచి చేతనం పుట్టినట్లు గూడ సూచిస్తుంది.

అధి వాస్తవిక వాదం బలమైన ప్రభావాన్ని కళల మీద వేసినా, అది సాహిత్యోద్యమంగా గూడ భాసిల్లింది. ఆంద్రిబ్రెటన్ ప్రకారం మొదటి అధివాస్తవిక సాహితీ కృతి "Les Champs Magnetiques" (1920; The Magnetic Fields 1985)లు. ఈ రెండోది ఫ్రెంచ్ రచయిత ఫిలిప్ సోపాల్ట్ స్వయం చాలిత రచనల సంపుటి. Jean Coctean సర్రియలిస్ట్ ఫిల్మ్‌లు తీశాడు. స్వయం చాలిత అధివాస్తవిక రచయితలు తమ ఆలోచనలను కాగితం మీద స్వేచ్ఛగా, ఏ మాత్రం కత్తిరించకుండ, లేక సరిచూసుకోకుండ ఎలా ఆలోచనలు మనస్సులోకి వస్తే, వచ్చిన వాటిని యథాతథంగా రాశారు. అలా రాయబడిన పదప్రవాహం (stream of words)ను అర్థం చేసుకోవడం కష్టం. ఆ తరవాత వీరూ, స్వయం చాలిత కళాకారుల లాగే, తమ స్వయం చాలిత రచనను కొంతవరకు సరి చేస్తూ వచ్చారు. అయితే ఈ సరిచేయడంలో వీరు ప్రతీకాత్మక ప్రతిమాలోచనను (symbolic imagery) నిక్షేపించారు.

అధి వాస్తవిక వాదులు బహిర్గతం చేయదలచుకొన్న అసంబద్ధ అందాన్ని ఇలా చెప్పవచ్చు; ఒక గొడుగు, ఇంకా కుట్టుమిషన్ యొక్క ''కళేబరాల కోత బల్ల వద్ద యాదృచ్ఛిక సమావేశం లాంటి అందం.'' రెండో ప్రపంచ యుద్ధ కాలంలో (మాసన్, ఎర్నెస్ట్, మట్టా) బ్రెటన్‌లతో సహాచాలమంది అధివాస్తవిక వాదులు అమెరికాలో ఉండడంతో వీరి ఉనికి అమెరికా అమూర్త అభివ్యక్త వాదానికి (abstract expressionist) ఊతం ఇచ్చింది. ఆర్షిగోర్కి, రాబర్ట్ మదర్‌వెల్, జాక్‌సన్ పోలాక్‌లను బాగా ప్రభావితం చేసింది.

ఈ కళాకారుల, రచయితల ప్రభావం సమకాలీన ప్రపంచంలో కళా, సాహితీ రంగాల మీద, రాక్ మ్యూజిక్, సినిమాల మీద పడింది.

ఫ్రాయిడ్ గతించినా, అచేతన ప్రప్వకం కొనసాగుతూనే ఉంది.

# రోమారోలా

## (1915వ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కారోపన్యాసం)

మూలం: సెవెన్ సోడర్మన్ అనువాదం: - బి.వి. రామిరెడ్డి

రొమెయిన్ రోలండ్ 1866వ సం॥ జనవరి 29వ తేదీన నీవ్రె జిల్లాలో జన్మించాడు. సాహిత్యం, సంగీతం, తత్త్వశాస్త్రాలు చదివాడు. 1895లో రెండు పరిశోధనా వ్యాసాలను ప్రచురించాడు. మొదటిది ''లె ఆరిజిన్స్ డు థియేటర్ లిరిక్ మోడరన్''. దీనికి ఫ్రెంచ్ అకాడెమి బహుమతి లభించింది. రెండవది ''కుర్ ఆర్స్ పిక్చరె అపుడ్ ఇటాలోస్ XVI సెక్యులి డెసిడెరిట్'' అదే లాటిన్ పరిశోధక వ్యాసం. ఇది 16వ శతాబ్దపు ఇటాలియన్ పెయింటింగ్ పతనాన్ని గురించిన విశ్లేషణ. చాలా సంవత్సరాలు స్కూలు మాస్టరుగా పనిచేశాడు. 1903లో సార్బోన్ విశ్వవిద్యాలయంలో ఉద్యోగంలో చేరాడు. 1910లో సంగీత చరిత్ర మీద గొప్ప కోర్సు నిర్వహించాడు. విశ్వవిద్యాలయంలో పనిచేస్తూనే సంగీత విమర్శ మీద విపరీతంగా కృషి చేశాడు. సంగీతం మీద వ్రాసిన విమర్శనాత్మక వ్యాసాల ప్రచురణతో ఫ్రాన్సులోనేగాక మొత్తం యూరోపులోనే గొప్ప పేరు ప్రతిష్ఠలు వచ్చాయి. 1908లో ''మ్యూజీషియన్స్ ఆఫ్ టుడే'' ప్రచురించాడు. ఆవిధంగా గొప్ప విమర్శకుడిగా గుర్తింపు పొందాడు. అతడు 1903లో ప్రచురించిన బీతోవెన్ జీవిత చరిత్ర, 1910లో ప్రచురించిన హాండెల్ జీవిత చరిత్ర అతని లోతైన సంగీత పరిజ్ఞానాన్ని తెలియజేస్తాయి. ఇవేగాక 1902లో ఫ్రాంకో మిల్లెట్, 1906లో మైఖెలాంజిలో, 1911లో టాల్‌స్టాయ్‌ల జీవిత చరిత్రల్ని వ్రాశాడు.

అతడు 1897లో రచించిన ''సెయింట్ లూయీ'' అనే అయిదంకాల నాటకంతో రచయితగా ప్రసిద్ధుడయాడు. 1909లో ''ట్రాజెడీ ఆఫ్ పెయింట్'' అనే నాటకాన్ని ప్రచురించాడు. వీటిలో చారిత్రక సంఘటనల ముసుగులో విశ్వాసులు తమ విశ్వాసంతో తమ ఆదర్శాలకోసం లోకంలో ఎదుర్కొనే బాధల్ని వివరించాడు. ఇవేగాక 1909లో ''థియేటర్ డిలా రివొల్యూషన్'', 1902లో ''లె 14 జూ-లెట్'', 1900లో ''డాంటిన్'', 1898లో ''ది ఉల్ఫ్స్'', 1903లో ''ది టైమ్ విల్ కమ్'' లను రచించాడు. ఈ నాటకాలు రోలండ్ నాటిక సంస్కరణాభిలాషను తెలియజేస్తాయి. నాటకాన్ని వ్యక్తిగత కీర్తి నుండి రక్షించి ప్రజలకు అందజేయాలని అతడు ప్రయత్నించాడు. అతడు తన అభిప్రాయాలను 1903లో ప్రచురించిన ''పీపుల్స్ థియేటర్'' అన్న పుస్తకంలో వివరించాడు. ఫ్రాన్సు దేశపు ఇలియడ్ అయిన ఫ్రెంచ్ విప్లవంలోని ముఖ్య ఘట్టాలను తన క్రొత్త నాటక ప్రక్రియ ద్వారా అందజేసే ప్రయత్నం చేశాడు.

1904-1902 సం॥రాల మధ్య కాలంలో రోలా తన సుప్రసిద్ధ నవల ''జీన్ క్రిస్టోఫ్'' ను రచించి ప్రచురించాడు. ఇవి స్వతంత్రమైన కథాకథనం. ఇందులోని కథనాలు - డాన్, మోర్నింగ్, యూత్, రివోల్ట్, ది మార్కెట్ ప్లేస్, ఏంటోనెట్, ది హౌస్, లే అండ్ ఫ్రెండ్‌షిప్, ది బర్నింగ్ బుష్, ది న్యూడాన్. 1910లో విశ్వవిద్యాలయ పదవికి రాజీనామా చేసి, రామ్‌లోను, స్విట్జర్లండ్‌లోను నివసిస్తూ పూర్తిగా సాహిత్యానికే తన సమయాన్ని అంకితం చేశాడు. యుద్ధకాలంలో స్విస్ వార్తా పత్రికల్లో వరుసగా వ్యాసాలు వ్రాసి ప్రచురించాడు. వీటిని 1915లో ''అబౌ బేటిల్'', అనే మకుటంతో ప్రచురించాడు. మానవాళి భవిష్యత్తు దేశాల ఇష్టాలకన్నా ఉన్నతమైనదని ఈ వ్యాసాల ద్వారా చాటాడు. రోలండ్‌కు యుద్ధం అంటే హింస, రాక్షసత్వం. అందుకే దేశాల రక్తపిపాసను, అధికార దాహాన్ని ఈసడించాడు. మానవతకు పట్టం కట్టాడు. 1918లో ''కోలాస్ బ్రునాన్'' అనే డ్రమెటిక్ ఫాంటసీని 1919లో 'లిలులి'ని, 1917లో ''ఎ స్టడీ ఆఫ్ ఎంపిడోకిల్స్'' వ్రాశాడు.

---

బి.వి. రామిరెడ్డి, సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు, విజయవాడ.

రోలండ్ ప్రసిద్ధ రచన ''జీన్ క్రిస్టోఫ్''కు 1915వ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కారం ప్రకటింపబడింది. ఈ నవలలోని శక్తివంతమైన పాత్రా ప్రస్థానంలో మనల్ని మనం చూసుకుంటాం. కళాత్మక శక్తి ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ, మానవాతీతమైన ద్రష్టగా ఎలా ఎదిగేదీ; సత్యాన్ని అన్వేషించే స్వభావం, ఆరోగ్యకరమైన నీతి, శుద్ధమైన కళాత్మకత జీవనప్రేమతో తనను ఎదుర్కొనే జీవిత సమస్యల్ని ఎలా ఎదుర్కొంటుందో; ఎలా స్వేచ్ఛనీ విజయాన్నీ సాధిస్తుందో చూస్తాం. ఈ నవల కేవలం ఒక ప్రధాన నాయకుడి జీవితాన్ని, పరిసరాలను వివరించేది కాదు. ఇది ఒక తరంయొక్క మొత్తం విషాదాన్ని వివరిస్తుంది. ఇది జీవితానికి కళకు సంబంధించిన అన్ని పార్శ్వాలను స్పృశిస్తుంది; గత శతాబ్దపు మేధో ప్రపంచపు అన్ని విషయాలను చర్చిస్తుంది. ఇందులో సామాజిక, రాజకీయ, భౌతిక, సాహిత్య, కళా విషయాలమీద చర్చ, నిర్ణయాలు వున్నాయి. ''జీన్‌క్రిస్టోఫ్''లోని కళాత్మక వ్యక్తిత్వం అపురూపమైనది. రోలండ్ దీన్ని కేవలం కళాతపనకో, పాఠకుల్ని సంతోషపెట్టడానికో, సంతృప్తి పరిచేందుకో వ్రాయలేదు. తన సత్యాన్వేషణా తపనను, నీతి అవసరాన్ని, మానవత్వం మీది ప్రేమని తెలియజేసేందుకే రోలండ్ ఈ రచన చేశాడు. రోలండ్ దృష్టిలో కళాత్మక జీవనం అంటే సౌందర్య సృష్టి మాత్రమే కాదు, అది మానవత్వపు కృషి కూడా. ''జీన్ క్రిస్టోఫ్'' ఆలోచన కవిత్వాల, ప్రతీక నిజాల, జీవితం కలల మేలుకలయిక. అది మనల్ని ఆకర్షిస్తుంది; ఉత్తేజితుల్ని చేస్తుంది; మనల్ని మనకు విశదపరుస్తుంది; విముక్తుల్ని చేస్తుంది. అది నీతియొక్క శక్తివంతమైన వ్యక్తీకరణ.

రోలాండ్ సత్యాన్వేషి, కళాకారుడే కాదు - గొప్ప కవి కూడా. ''జీన్ క్రిస్టోఫ్''లోని పాత్రచిత్రణ ఒక భావోద్వేగ సృష్టి. దీనిలోని అఖండత, వ్యక్తిత్వం మనల్ని ఆశ్చర్యపరుస్తాయి. ఈ ప్రధాన పాత్ర చుట్టూ అనేక మానవ పాత్రల్ని చూస్తాం. తను వర్ణించే పాత్రల అంతరాంతరాల్లోకి అతడు చొచ్చుకుపోతాడు. తన పాత్రల ఆత్మల్ని మానసిక కళతో చిత్రిస్తాడు. అతని స్త్రీపాత్రలు కళాఖండాలు. అతని పాత్రలు నిజ జీవితంలోని అన్నివర్గాలకు చెందినవి. వాటినతడు సంక్షిప్తంగా, శక్తివంతంగా వాటి బాధాత్మకతతో బాటు చిత్రిస్తాడు. రోలండ్‌లోని ఆత్మిక నిజాయితీ కవితాత్మక రూపాలను ఉపయోగించనీయదు. అతడు చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా చెబుతాడు. ప్రేమ, క్రోధం, ఉత్సాహం, ద్వేషం. ఆనందం, విషాదం లాంటి వాటితో హృదయం నిండిపోయినపుడు అతని వాక్యాలు రూపుదాలుస్తాయి. రోలండ్ ఫ్రెంచి వచన రచయితలలో ఎవరెస్టు లాంటివాడు.

''జీన్‌క్రిస్టోఫ్'' రచయిత మన సమకాలీన యుగాన్ని అత్యున్నత స్థాయిలో ప్రభావితం చేసిన సాహిత్యకారుడు. అతడు గొప్ప కవి, మహితాత్ముడు. అతని రచన ప్రపంచ సాహిత్యంలో తన స్థానాన్ని పదిలపరుచుకుంది. అది ఈ శతాబ్దపు అత్యుత్తమమైన, సాహసవంతమైన, ఆరోగ్యవంతమైన రచన.

**జీవిత చరిత్ర**

మొదటి ప్రపంచ యుద్ధ కాలానికి చెందిన రొమెయిన్ రోలండ్ రచనలు అతని ఇష్టాల్ని విశదీకరిస్తాయి. ఇరవైలలో రోమన్‌ఫ్లీవ్ ఏడు వాల్యూముల్లో, ది సోల్ఎన్‌ఛాంటెడ్ వ్రాశాడు. ''బీతోవెన్'' జీవిత చరిత్రలో బీతోవెన్ సంగీతం, కళాకారుడిగా అతని సమస్యను వివరించాడు. తన శాంతి అన్వేషణ తపనలో రోలండ్ గాంధీజీ అహింసా ఉద్యమం చేత ఆకర్షితుడయ్యాడు. 1924లో గాంధీమీద ఒక పుస్తకం వ్రాశాడు. ఇండియామీద, బౌద్ధధర్మంమీద రోలండ్‌కు ఎనలేని ఆకర్షణ. 1929-30లలో ''ప్రోఫెట్స్ ఆఫ్ న్యూ ఇండియా'' వ్రాశాడు. అతడు రాజకీయంగా సోషలిస్టు భావాల వల్ల ప్రభావితుడయ్యాడు. ''ది ఫోర్ రన్నర్స్ (1919), 'క్లెరంబాల్ట్'' (1920), ''ది గేమ్ ఆఫ్ లౌ అండ్ డెత్'' (1925), ''పెగీ'' (1944) అతని ఇతర రచనలు.

# సప్త గోదావరి ఎక్కడ?

– డా॥ సంగనభట్ల నరసయ్య

ఒక నది ప్రవహిస్తూ ఎక్కడైనా రెండు చీలికలై తిరిగి కింద ఎక్కడో కలియవచ్చు. మధ్యలో వచ్చిన కఠిన శిలాయుతమైన భూభాగాలు ఇలాంటి చీలికకు దారితీస్తాయి. నీటిని లంకలు, కూర్మలు అంటారు. నది చాలా విశాలమైన ప్రవాహం గల్గినపుడు ఇది సంభవం. ఒక్కోసారి ఈ చీలిక చాలా దూరం వెళ్లినపుడు మధ్య లంకలో గ్రామాలుండటం కూడా కద్దు. కాని ఆ నది రెండుకు మించిన చీలికలు ( అంటే ఒకటికి మించి లంకలు) సృష్టిస్తూ ప్రవహిస్తే? అది ఒక అపురూపమైన ప్రాకృతిక సంభవం అవుతుంది. విశాలమైన గోదావరి నదికి ఈ ఏడు పాయలు సాధ్యమైనాయని తెలిస్తే అది ఎంత అపురూపం? ఆ స్థలాన్ని ప్రజలు పవిత్రంగా, ప్రతిష్ఠాత్మకంగా స్వీకరిస్తారు.

తూర్పు గోదావరి జిల్లాలోని దాక్షారామాన్ని సప్తగోదావరి తీర్థ క్షేత్రమని, సప్తగోదావరి జల పూత భీమేశ్వరస్వామి అక్కడ వెలిసాడని పురాణాలు, కావ్యాలు ఘోషిస్తున్నాయి.

సప్తగోదావరీ తీర్థ భీమేశ్వర స్వామి తెలుగునాట ఏలా ప్రసిద్ధుడయ్యాడు? దీనికొక కారణం ఉంది. శాతవాహన చక్రవర్తులలో విశిష్టుడు, కావ్య ప్రియుడు, కవి, కవి పండిత పోషకుడు అయిన హాల శాతవాహన చక్రవర్తి క్రీ.శ. 1వ శతాబ్దిలో శాతవాహన సామ్రాజ్య పాలకుడు. ఈతని కొలువులోని కవులు రాసిన అనేక గాథాలు ( ప్రాకృతంలో గాథ అంటే పద్యం) శాతవాహన సప్తశతి / శాలివాహన సప్తశతి/గాథా సప్తశతి అనే పేరుతో సంకలనమై, సభ్య శృంగారంతో, మనోహరమైన కవిత్వంతో సుప్రసిద్ధమైనాయి. హాలుని ప్రేరణతోనే 'లీలావతి' అనే మరో ప్రాకృత కావ్యం కుతూహలుడనే కవి రాసాడు. ఇది మహారాష్ట్రీ ప్రాకృతంలో రాయబడ్డ గ్రంథం. ''లీలావ ఈ'' అనే పేరుతో శృంగార వర్ణనలతో 800 అనుష్టుప్ గాథలతో వర్ణితమైన ఈ కావ్యంలో కథ హాల శాతవాహన చక్రవర్తికి సింహళ ద్వీప రాజ కన్య లీలావతితో జరిగిన ప్రేమగాథ, వివాహము. కుతూహలుడు వేదవిదాంగ విదుడైన భూషణ భట్టు కుమారుడు. అధీత వేద త్రయి, నిరతాగ్ని హోత్రి బహులాదిత్యునికి మనుమడు. హాల లీలావతుల వివాహము సప్త గోదావరి తీర్థ భీమేశ్వరుని సన్నిధిలో జరిగిందని రాసాడు. దాక్షారామం అని రాయలేదు. కాని ఈ కావ్యానికి అనంతరంగా వచ్చిన భీమేశ్వర క్షేత్ర మహాత్మ్య గ్రంథం (క్షేత్ర మహాత్మ్య గ్రంథాలు, బ్రహ్మాండ పురాణ లేదా స్కాందపురాణాంతర్గతాలంటూ కల్పించి స్థానికులు రాసినవి అనేకం ఉన్నాయి.) లో ఈ సప్త గోదావరి వర్ణింపబడింది. ఇది శ్రీనాథ కృతమేననే మరో ప్రవాదం ఉంది. శ్రీనాథుడు తన అనువాదం ( భీమేశ్వరపురాణం కావ్యానికి) కు ముందో వెనుకో సంస్కృతంలో రాసాడని చెప్తారు. గోదావరి నది సముద్ర సంగమంకంటే ముందు చీలికలైంది. ప్రచార, రవాణా సాధనాలు లేని కాలం కనుక చీలిక లెన్నో తెలియక గతానుగతికంగా కథలు గాథలు పుట్టుకొని వచ్చాయి. నాబాల్యంలో మా గ్రామంలో ఇలా చెప్పగా విని, అక్కడ గోదావరి ఎంత పెద్దగా ఉందో అని ఊహలు చేసాను.

ప్రప్రథమంగా దాక్షారామాన్ని నేను దర్శించి, అక్కడ అసలు గోదావరే లేక పోవడంతో నివ్వెర పోయాను. గోదావరి తీరానికే ఈ గ్రామం సుమారు 30/40 కి.మీ. దూరాన ఉంది. ఎందుకైనా మంచిదని స్థానికులను ప్రశ్నిస్తే భిన్న కథనాలు వినిపించాయి.

---

డా॥ సంగనభట్ల నరసయ్య, ప్రిన్సిపాల్, శ్రీలక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల,
ధర్మపురి, కరీంనగర్ జిల్లా.

i) భీమేశ్వరుని దేవాలయం ముందున్న జలాశయమే సప్త గోదావరి పేరు కలదని,

ii) గోదావరి జలాలు ఋషులు ( బహుశ సప్త ఋషులు) తెచ్చి ఏడుసార్లు దీనిలో కలిపారని,

iii) గోదావరి దూరప్రాంతం నుండే అంతర్వాహినిగా వచ్చి ఈ సరోవరంలో కలుస్తుందని

ఇలాటి కథనాలు వినిపించాయి. కాని ఇవన్ని సర్దుబాటు కథలు, సత్యదూరాలని అర్థమైంది.

దాక్షారామ స్థలపురాణమైన భీమేశ్వరపురాణంలో పరిశీలించినపుడు 'సప్త గోదావరమని' ఏక వచనం ఉంది.

i) 'సప్త సింధువునకు, భీమ శంకరునకు'... భీమే. పురా. Vi - 83.

ii) 'శివగంగా జలముల ...' - శివగంగా కూపమునందలి నీటిలో అని వ్యాఖ్య రాసారు VI -71

iii) 'గ్రుంకు తోపులు సప్తగోదావరంబున...' VI-53

iv) 'మహాముని సింధువు దరి'... VI-39
మహర్షులచే గొని రాబడిన సప్తగోదావరము యొక్క అని వ్యాఖ్య

v) 'సప్తగోదావరి జల తరంగా రోహ ...' I-98
సప్తగోదావరమను పేరుగల నది యొక్క అని వ్యాఖ్య

ప్రసిద్ధంగా పురాణంలో ఉన్నట్టుగా అనువదించిన శ్రీనాథుడు దీన్ని పట్టించుకోలేదు. శ్రీనాథుని రచనను వ్యాఖ్యానించే ఆధునికులకు ఈ పట్టున వ్యాఖ్య చేస్తూ తోచక ఏకవచనంలో లేదా సామూహిక ఏకవచనంగా, లేదా 'ఆ పేరుగల నది' అని రాసారు.

సర్ అర్థర్ కాటన్ మ్యూజియం, ధవళేశ్వరంలో గోదావరి ప్రవాహం చిత్రం పరిశీలించినపుడు ఇది వశిష్టగౌతమి అనే రెండు పాయలుగా చీలి సింధు గర్భాన చేరుతోందని అర్థమైంది. అక్కడి మ్యూజియం క్యూరేటర్‌ని అడిగితే గోదావరికి ఏడు పాయలు లేవని నిష్కర్షగా చెప్పాడు.

లీలావతి కావ్యంలో ప్రశంసించిన సప్తగోదావరి ఎక్కడ? ఇది అబద్ధమా? అనే శంకతో ఉండగా నాకీ మధ్యలో గోదావరికి ఏడుపాయలున్నాయని అది కరీంనగర్ జిల్లాలోనే ఉందని తెలిసి ఆశ్చర్యపోయ్యాను.

గోదావరి తీర్థమైన ధర్మాపురికి ఎగువా 40 కి. మీ. దూరంలో మల్లాపూర్ మండలంలో వేంపల్లె వెంకటరావు పేటల వద్ద గోదావరి ఏడు చీలికలుగా చీలింది. గోదావరి ఈవలి గట్టు కరీంనగర్ జిల్లా, ఆవలి గట్టు అదిలాబాద్ జిల్లా.

వేంపల్లి నుండి 3 కి. మీ. వెళ్తే గోదావరి నది వస్తుంది. దాన్ని దుబ్బరేవు అని వ్యవహరిస్తారు. (1) దుబ్బరేవులో దిగి ఒకపాయ దాటితే, (2) రాజుగారి పాయవస్తుంది, అది దాటితే (3) రొంపి మడుగు, అది దాటితే (4) రొయ్యలమడుగు, అది దాటితే (5) తొక్కుడు బండల పాయ, అది దాటితే (6) సందుగుండ్లు, అది దాటితే (7) రేగడిమడుగు, అది దాటితే (8) అక్కొండ గుట్ట వస్తుంది. ఈ అక్కొండ లేదా అక్కకొండ గుట్ట అదిలాబాద్ జిల్లా రేవు. కొద్ది దూరంలో కొండ ఉంది. పై ఎనిమిది రేవుల మధ్య ఏడుపాయలు ఉన్నాయి. గోదావరి నిండుగా పారినపుడు ఈ ఏడు పాయలు స్పష్టంగా కనబడతాయని స్థానికుడు వాల్మీకి కులం వాడైన రాసోటి ఎంకటి అనే వ్యవసాయ దారుడు చెప్పాడు. అన్ని పాయలు దాటాలంటే స్థానికులైన జాలర్ల సాయం కావాలి. నిర్మానుష్యం,

అతి భయానకమైన ఆ రేవుల్లో జల చరాలు కూడా ఉంటాయని చెప్పాడు. దాటడానికి ఈ రేవును ఎవరూ వాడరు. చాలా విశాలమైంది. కాలినడకన 2 గం॥లు పడుతుందని చెప్పాడు. మేం రెండు రేవులు చూసాం. మిగతావి ఎత్తునుండి చూసి వదిలి వేసాం. రాజు గారి పాయవద్ద బండకు శాసనం ఉందని, చదవలేమని చెప్పాడతడు. నేను శాసనం చూడలేదు. ఎదురుగట్ల సుదర్శన్ అనే అధ్యాపకుడు మాకు తోడుగ వచ్చారు.

ఈ అధ్యాపకుడు గోదావరి తీరం వెంబడి అడవిలో నడుస్తుండగా కొన్ని ఇనుప ఖనిజం ఉన్న రాతి ముక్కలు చూపాడు. ఉల్లిగడ్డల వ్యాపారం చాలా ప్రాచీన కాలంలో ఉండేదని, పొట్టు ఏనుగుల మీద వేసుకొని పొయ్యేంత వ్యాపారం సాగేదని చెప్పాడు. అక్కడ రెండు ప్రాచీన శివాలయాలు చూపాడు. అవి కాకతీయులు వేములవాడ లేదా చాళక్యుల కాలంనాటివి. అంటే 9శ. లేదా 12వ శతాబ్ది నిర్మాణాలు. ఒక ఆలయంలో ఇటీవల నంది విగ్రమం కింద నిధులున్నాయని భ్రమించి, విగ్రహం పెళ్ల గించి తవ్వినారు. 1 శతాబ్ది వాడైన హాలుడు పెళ్లి చేసికొన్న దేవాలయాలు ఇవి కావనిపించింది. గోదావరి తీరాన వెతకగా ఒక ఆలయ అవశేషాలు కనబడ్డాయి. ప్రహారీ గోడలు మిగిలిన ముఖమంటపం, మనిషి పట్టలేనంత ఇరుకైన గర్భాలయం గల శిథిలాలున్నాయి. చాలాచిన్న గుడి. ఇదే భీమేశ్వరాలయం కావచ్చును. ఆ ఆలయం ప్రహారీ గోడకు వాడిన ఇటుక శాత వాహనుల కాలపుది. ఇది 30'' x 20'' ఇంచుల అసాధారణమైన ఇటుక బిళ్ల. ఇవి కోటిలింగాల తవ్వకాలలో దొరికిన ఇటుకల సైజులో ఉన్నాయి. ఈ ఆలయంలో లింగం లేదు, ఖాళీగా ఉంది. పై ఇటుక గోడలు 3 ఫీట్ల ఎత్తులో మాత్రమే ఉన్నాయి. ఇక్కడి లింగం సంగతేమోగాని, నంది విగ్రహం మాత్రం జగిత్యాలలో హరిజన వాడలోని నీళ్లబావి వద్ద ఉందని చెప్పారు. ఈ దేవాలయం శాతవాహనుల కాలపు నిర్మాణం అని ఖచ్చితంగా చెప్పవచ్చు. లీలావతిలో వర్ణించిన భీమేశ్వరాలయం ఇదేకావచ్చు. ఇది గోదావరి నదికి 10 గజాల దూరంలో ఉంది. వరదలకు శిథిలం కావచ్చు. పైగా 2 వేల సంవత్సరముల కిందిది కనుక ఇంతకు మించిన ఆనవాళ్లు దొరకక పోవడం విశేషం కాదు.

ఈ ప్రాంతం శాతవాహనుల ఏలుబడిలోనే ఉండేది. శాతవాహనుల తొలి రాజధాని నగరం కోటిలింగాల గ్రామం ఈ వేంపల్లికి 50 కి. మీ. దూరంలో ఉంది. మా ధర్మపురికి 10 కి. మి. దూరం. గోదావరి తీర గ్రామం. ఇక్కడ శాతవాహనుల్లో శ్రీముఖుని, శాతకర్ణి రాజుల నాణేలు దొరికాయి. శాతవాహనుల కాలపు నగరం, ఇండ్లు, నీటి వ్యవస్థకు సంబంధించిన ఇటుక కట్టడాలు తవ్వకాలలో లభించాయి.

ఈ కోటిలింగాలలో శ్రీముఖుని కన్నా పూర్వుడైన శాతకర్ణిరాజు నాణేలు, బ్రాహ్మీ లిపి శాసనాలు లభించడం చేత ఇది తొలి శాతవాహనుల రాజధానిగా చారిత్రకులు పేర్కొన్నారు. అందువల్ల ఈ ప్రాంతం ( కరీంనగర్ జిల్లా) హాల చక్రవర్తి ఏలుబడిలో ఉండేదని చెప్పవచ్చు.

గోదావరి జిల్లాలు శాతవాహనుల నాటికి సుప్రసిద్ధ జనావాసాలుగా లేవు. కనుక తన రాజ్యంలోని, తన రాజధానికి సమీప ప్రాంతంలోని వేంపల్లి వెంట్రావు పేటలో సప్త గోదావరి తీరాన భీమేశ్వరాలయంలో హాలుడు లీలావతిని పెండ్లి ఆడటం జరిగిందని చెప్పవచ్చు. గోదావరి పుట్టిన నాసిక త్ర్యంబకం నుండి అంతర్వేది ( సాగర సంగమం) వరకు గోదావరికి ఏడుపాయలు ఎక్కడా ఉన్నట్టు లేదు, ఇక్కడ తప్ప. ఏడుపాయలుగా నది చీలడం వింతల్లోకెల్ల వింత. అందుకేనేడు అరణ్య మధ్యగ్రామం నాడు ప్రసిద్ధ క్షేత్రం కావడం, చక్రవర్తి వివాహ స్థలం కావడంలో వింత లేదు. భావి పరిశోధనలు ఇంకా ఖచ్చితమైన నిజాలు తేల్చవచ్చు.

# సమసమాజం గురించి

- డా॥ సర్దేశాయి తిరుమలరావు

*(గత సంచిక తరువాయి)*

''మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా?'' అని శ్రీశ్రీ తపిస్తాడు. ''వెనుక చూచిన కార్యమేమోయి. మంచి గతమున కొంచమేనోయ్, మందగించక ముందుకడుగేయ్, వెనుక బడితె వెనుకెనోయ్'' అని గురజాడ అంటే ''పదండి ముందుకు పైపైకి'' అని శ్రీశ్రీ పురమాయిస్తాడు.

గతకాలాన్ని స్మరిస్తూవుండే వానిని చాదస్తుడనో, వేదాంతి అనో నవ్వుకొని వూరకుంటాము. భవిష్యత్తుగురించి మాట్లాడే వానిని క్రాంత దర్శిఅనో, విప్లవవాదిఅనో, ఆదర్శవాది అనో, దివాస్వాప్నికుడనో మంచి పదజాలాన్నే వాడుతాము. గతం పోయింది. భవిష్యం రాలేదు. వాటి జోలి మనకెందుకు. ఉన్నది ఈనాడు. ఇప్పుడే మనం ఆనందం అనుభవించవలె అనే వానిని నాస్తికుండనీ, హిడానిస్టు అనీ శాపనార్థాలు పెట్టుతాము. ఏమి న్యాయం ?

కనపడే దానికన్నా కనపడనిది బాగున్నట్లనిపిస్తుంది. అందుకే ఆదర్శ పరిస్థితులు భూతకాలంలోనైనా వున్నట్లు చెప్పుతారు. భవిష్యత్తులోనైనా వుంటాయని చెప్పుతారు. రామరాజ్యం భూతకాలంలోనుండిన ఆదర్శరాజ్యమని కొందరంటారు. తమ గృహచ్ఛిద్రాలతో ప్రజల పాణాలు తోడే నేటి మంత్రులవలెనే, శ్రీరాముని రాజ్యమూనూ అనేది మరచిపోతారు.

పదునారవ శతాబ్దంలో సర్ థామస్ మోర్ ఒక ఆదర్శ సాంఘిక వ్యవస్థను భావించుకొని UTOPIA అనే పేరుతో ఒక గ్రంథంలో ఆ వ్యవస్థను విశదంగా వర్ణించినాడు. గ్రీకు భాషలో OU అంటే Not. TOPIA అంటే Place. UTOPIA అంటే Nowhere అని అర్థం. ఆదర్శంగా ఏదీ ఎక్కడా వుండదు. అటువంటి ఆదర్శస్థలమే Utopia . ఎక్కడాలేని స్థలం. ఈ పదాన్ని నేను ''అతలం'' Utopiaకు సమానం. నా ''అతలం'' మన అధోలోకాల్లో ఒకటికాదు. ''అతలం'' ఎక్కడా లేని స్థలమన్నాను. అది అ స్థలం - మోర్ యొక్క Utopia.

మేధావులు ఎన్నో ఆదర్శవ్యవస్థల గురించి కలలు కన్నారు. వర్ణించినారు. ప్రణాళికలు తయారు చేసినారు. ''బ్లూప్రింటు''లు రచించినారు. అనుబంధంలో అతలాల పట్టిక ఈయబడింది. కొన్ని అతలాలు భూతకాలమందుండగా, కొన్ని అతలాలు భవిష్యత్తులో ఉంచబడ్డాడయి. మొదటివి విస్మృతి పథలంలోనివి కాగా రెండవవి క్రాంత దృష్టిపథంలోనివిగా కనిపిస్తాయి. మొదటిది రాత్రికలలు. రెండవవి పగటి కలలు. బేకను "New Atlantis", గాంధి ''రామరాజ్యం'' భూతకాలంలోనుండి నాయనుకొని, భవిష్యత్తులో స్థాపించవలెనని అనుకొనే అతలాలు. ఎక్కడాలేని, ఉండని, ఆదర్శవ్యవస్థలని వర్ణించిన అతలాలు ప్లేటో "Republic", థామస్ మోర్ "Utopia", విలియం మారిస్ "News, from Nowhere", గురజాడ ''దేశభక్తి'' గేయం. శాస్త్ర, సాంకేతిక విజ్ఞాన

---

కీ॥ శే॥ డా॥ సర్దేశాయి తిరుమలరావు, ప్రముఖ సాహిత్య విమర్శకులు, (1928 - 1994)

విడంబనం వల్లనూ, ఏకపక్షనియతృత్వ రాజ్యాలు విజృంభణ వల్లనూ పరిణమించే ఘోరపరిస్థితులను వర్ణించే అతలాలు ఉన్నాయి. వీటిని దుష్ట్రలాలు (Dystonpia) అనవచ్చు. ఆలడస్ హక్స్లే"Brave New World", జార్జిఆర్వెల్ ''1984'', వెల్స్ Modern Utopia, సోల్జనిత్సిన్ వ్రాసిన సోవియట్ రష్యా వ్యతిరేక ప్రహసనాలు దుష్ట్రలాలకు కొన్ని నిదర్శనాలు.

''ఇవాన్ మూర్ఖుడు'' అనే చిన్నకథలో టాల్స్టాయ్ ఆదర్శ వ్యవస్థను ఎంతో హాస్య సరళంగా చిత్రించినాడు. ఆ కథలో మనుష్యుని పతనం చేసే ''స్వంత ఆస్తి'' ని బలపఱచే సైతాను ''తలకాయపని'' చేస్తూ చేస్తూ బుర్రపగిలి చచ్చిపోతాడు.

జోనాథన్ స్విఫ్టు మానవుణ్ణి ఎంతవరకు తిట్టవచ్చునో, అంతవరకూ నోరార తిట్టి పోసినాడు. ''గలివరు యాత్రలు'' అనే గ్రంథంలో మానవ జాతినే ఖండించి వేస్తాడు. గలివరుయాత్రకు పోయిన దేశాల్లో ''హ్యూహెనెం'' అనే అశ్వద్వీపం ఒకటి. ఈ దేశంలో గుర్రాలదే పౌరుసత్వం. వీనికి చాకిరీ చేసేందుకు ''యాహూ''లు అనే పరమనికృష్ట మృగాలుంటాయి. ఈ యాహూలెవరనుకొన్నారు? మనమే! హ్యూహెనంల గుణగణాలని మన గలివరు ( ఇతడు వాని దృష్టిలో యాహూయే) ఇట్లా ఉగ్గడిస్తాడు.

స్నేహ దయా దాక్షిణ్యాలు హ్యూహెనెంలలో సర్వత్రా కనిపించే సుగుణాలు. *''అసత్యము'' అనే మాట వాళ్ళ బాషలో లేదు.**

ఆ దేశంలో *** వదరబోతులు, పరనిందకులు, చాడీకోరులు, జేబుదొంగలు, దారిదోపిడీ గాండ్రు, కన్నపు దొంగలు, వకీళ్ళు, కుంటెనకత్తెలు, హాస్య వేటగాండ్రు, రాజకీయవాదులు,

---

* Friendship and benevolence are the two Principal virtues among the Houyhnhnms and these are not confined to particular objects, but universal to the whole race.

** ... they have no word in their language to express lying or falsehood.

*** ... here were no gibbers, censurers, backbiters, pick pockets, highwaymen, house breakers, attorneys, bawds, buffoons, gamesters, politicians, splenetics, tedious talkers, controvertists, ravishers, murderers, robbers, virtuoses, no leaders or followers of party and faction, no encouragers to vice by seducement or examples, no dungeon, axes, giblets, whipping posts or pillories, no cheating shop keepers or mechanics; no pride, vanity or affection, no fops, bullies, drunkards, strolling, whores or poxes, no ranting, lewd, expensive vives, no stupid proud pedants; no importunate, over bearing, quarrelsome noisy, roaring, empty, conceited swearing companions; no scoundrels ... no lords, fiddlers, judges or dancing masters.

A voyage to the Honyhnhnms, Gulliver's Travels by Jonathan Swift.

చిర్రుబుస్సులాడేవాళ్ళు, అధికప్రసంగ రాద్ధాంతులు, స్త్రీమానభంగం చేసేవాళ్లు, హంతకులు, గజదొంగలు, కళాకారులూ లేరు. రాజకీయ పక్షాల మతాల నాయకులుకానీ, అనుయాయులు కానిలేరు. ఆశచూపెట్టికానీ, ఆచరణ ద్వారా కానీ, వ్యసనాలకు ప్రోద్బలం లేదు. భూగృహ కారాగారాలు, గొడ్డండ్లు, ఉరికంబాలు, కొరడా దెబ్బలు వేసేముందు కట్టే కంబాలు, నేరం చేసినవాణ్ణి జనులు హేళన మొదలగు వానికి గురిచేసేందుకు అనువుగా వాని చేతులను, తలను, రంధ్రంలో బిగించి బహిరంగంగా ప్రదర్శించే కొయ్య చట్రాలు లేవు. దగా చేసే అంగడివాళ్లు, యంత్రకారులూ ఉండరు. గర్వం, దంభంలేవు. డాబులరాయళ్లు, పేచీ కోరులు, త్రాగుబోతులు, సంచారవేశ్యలు లేరు. గయ్యాళి గంపలైన భార్యలు, బుద్ధిహీనులు, పండితమ్మన్యులు, ఎప్పుడూ అరుస్తూ, కొట్లాడుకొనే స్నేహితులు, వుండాకోర్లు లేరు. భూస్వామ్య ప్రభువులు, ఫిడేలు వాయించే వాళ్లు, న్యాయమూర్తులు, నట్టువకాండ్రూలేరు.''

మన సంఘంలో ఏయే చెడుగులు వున్నాయో వాటిని ఏకరువు పెట్టుచున్నాడు స్విఫ్టు, ఆదర్శ వ్యవస్థలో అవి వుండరాదని చెబుతున్నాడు. ఇక ''యాహూ''లనే మృగాల ( అంటే మనుష్యులే) ప్రవర్తనను ''హుయ్హునెం''లలో శ్రేష్టుడొకడు గలివరుకిట్లు చెప్పుచున్నాడు.*

---

* He said the yahoos were known to hate one another more than they did any different species of animals.

If you throw among five yahoos as much food as would be sufficient for fifty, they will, instead of eating peaceably fall together by the ears, each single one impatient to have all to itself.

That in some fields of his country, there are certain shining stones of several colours, whereof the Yahoos are violently fond.

Another thing he wondered at in the Yahoos was their strange disposition to nastiness and dirt, whereas there appears to be a natural love of cleanliness in all other animals.

My master said there was nothing that rendered the Yahoos more odious than their undistinguishing appetite to devour everything that came in their way.

It was peculiar in their temper that they were fonder of what they could get by rapine or stealth at a greater distance than much better food provided for them at home.

I did indeed observe that the Yahoos were the only animals in this country subject to any diseases ... the cure prescribed is a mixture of their own dung and urine forcibly put down the Yahoos's throat.

''యాహూలు ఇతర మృగములకంటె తమను తాము ఎక్కువగా ద్వేషించుకొంటాయి. ఐదు యాహూలకు, యాభైకి సరిపోయే మేత వేస్తే శాంతంగా మెక్కక, ప్రతి యొక్కటీ అంతాతనకే కావలెనని చెవుల బట్టికొని గుంజులాడుతాయి. రంగురంగుల మెరసే రాళ్లంటే (ఇవి నవరత్నాలు) యాహూలకు పిచ్చిప్రేమ. యాహూల విషయమై ఇంకొక ఆశ్చర్యకర సత్యమేమంటే, వాటికి అశుచిపైనా, గబ్బుపైనా ఉండే ఆకర్షణ. ఇతర జంతువులకు శుభ్రత నైజగుణం.

యాహూలను ఏహ్య జంతువులుగా చేసే గుణం ఏదంటే, చేతికి చిక్కిందాన్నెల్లా మింగి వేసే తీరని భక్ష్యాభక్ష్య క్షుత్తు. ఇంటిలో గాడి పట్లలో వేసిన నాణ్యమైన మేతకంటే, దూరం నుంచి కొల్ల గొట్టిన లేదా దొంగలించిన తిండి అంటేనే ఇష్టపడుట యాహూల ఇంకొక చిత్రగుణం. అన్ని విధాలైన రోగాలు వచ్చేది ఒక్క యాహూలకే. దీనికి ఔషధమే మంటే వాటి మల మూత్రాలను కలిపి కషాయంచేసి వాటి గొంతులో పోయుటే''.

గలివరు యాత్రకు పోయిన ''మహాకాయుల'' ద్వీపం (Brobdingnag) రాజు గలివరు దేశపు మనుషులు భూమ్మీద ప్రాకే అసహ్యక్రిములలో నికృష్టతములు అని తన తీర్పును ఇస్తాడు. *

స్వీఫ్టు మానవుని ఆశాపాతకత్వాన్ని, దౌష్ట్యాన్నీ, అసమతల దర్పణాలతోనూ, సూక్ష్మదర్శిని తోనూ, దూరదర్శినితోనూ అనేక కోణాలలో నిశితంగా పరీక్షించినాడు. మైలమ భీముని ఖడ్గ సృష్టికి ఏమేమి కావలెనో అవి స్విఫ్టు రచనకూ కావలెను. స్విఫ్టుతన కాలము నాటికే ప్రబలిన ధన స్వామ్య వ్యవస్థను చిత్రిస్తున్నాడు.

ఆస్తి, ధనశక్తి, దోపిడి అనే పెట్టుబడిదారీ విధాన లక్షణాల ఖండనే స్విఫ్టు మహాశయుడు చేస్తూన్నది. ఆస్తులు కల్గిన విరామ వర్గంవారి రాకాసితనాన్ని వెబ్లెను. The Leisured Class లో మెత్తమెత్తగా మొత్తినాడు.

సెయింటు అగస్టీను City of God అనే ఆదర్శ క్రైస్తవ అతలం వ్రాసినాడు. అటువంటిదే యాగంటి లక్ష్మప్ప ''మావూరు''.

యాగంటి లక్ష్మప్ప తత్వం పూర్తి పాఠం ఇస్తున్నాను:

''ఏవూరయ్యా మీదేవూరు - పరబ్రహ్మ నిర్మాణమే మావూరు
కందిమల్లయ పల్లె మావూరు - కాలకర్మల బాపును మావూరు
కనుల యెదుట నుండును మావూరు - అట్లుకనవచ్చు కనరాదు మావూరు
ఇంటిలోపలి పుట్ట మావూరు - పాములంటితే ఫలమిచ్చు మావూరు

* The king of Brobdingnag condemns the bulk of Gulliver's countrymen as "the most pernicious race of little odious vermin that nature ever suffered to crawl upon the surface of the earth".

కర్మజీవులకెల్ల మావూరు - అంధకారమై యుండును మావూరు
కర్మలు తెగితేను మావూరు - పండువెన్నెలై యుండును మావూరు
రోగాలు లేవయ్య మావూరు - నిత్య భోగాలు కలిగుండు మావూరు
కనికానకున్నది మావూరు - ముక్తికారణమైయుండు మావూరు
పాపలనడుమను మావూరు - బట్ట బయలైయుండును మావూరు
శృంగారమై యుండు మావూరు - శ్రీరంగమైయుండు మావూరు
తల్లిగోవిందమ్మ మావూరు - తండ్రి వీరబ్రహ్మ మావూరు''.

ఇందు ఆధ్యాత్మికతతోబాటు ఆగ్రామం లౌకికాదర్శాలు కల్గినట్లు సూచింపబడుట విశేషం.

సంఘం ఎట్లా నిర్మింపబడవలెనేందుకు రెండు నమూనా (models)* లను ఎంపికచేయవచ్చును. మార్క్స్యీయ దృక్పథంలోని ఆదర్శ కమ్యూను. పోవరీయ దృక్పథంలోని ''క్రమక్రమ సాంఘిక ఇంజనీరింగు'' (Piecemeal Social Engineering). దిగువ పట్టికలో పైని రెండు విధానాలు పొందు పఱుపబడ్డాయి.

| అంశం | సమస్యాపరిష్కార పద్ధతి (పోపరు) | ధ్యేయనిర్ణయ పద్ధతి (మార్క్స్) |
|---|---|---|
| కాలం | భూత, వర్తమానం | వర్తమానం, భవిష్యత్తు |
| తత్క్షణధ్యేయం | సమస్యానిర్వచనం | లక్ష్మనిర్ణయం |
| అంతర్గత తత్వం | వర్తమాన వ్యవస్థలోని లోపాలను కనిపెట్టుట | ప్రపంచం ఎలావుండ వలెనో అని అనుకొనుట |
| రాజకీయ పర్యవసనాలు | స్వేఛ్ఛావాదం విషయాల అందుబాటు, పబ్లిక్ డిబేటు, ప్రభుత్వ విమర్శ | ''ప్రణాళిక''ను అమలులో పెట్టుట, చర్చాబహిష్కారం, వైవిధ్యాన్ని అణచివేయుట |
| ముగింపు | ప్రస్తుతచెడుగుల నివారణ | భవిష్యత్తులో మంచిది కలుగుట |

పైని పట్టిక చూస్తే మొదటి పంథ సంస్కారమనీ, అందు మార్పు క్రమగతమని, రెండవ పంథ విప్లవమనీ, అందు మార్పు హఠాత్సంభవమనీ తెలుస్తుంది.

గురజాడ ''దేశభక్తి'' గేయంలో మొదటి మార్గం సూచించబడింది. ఉన్నవ ''మాలపల్లి'' నవలలో తక్కెళ్లపల్లి జగ్గని ద్వారా రెండవ మార్గం సూచించ బడింది. వాటిని పఠనా సౌకర్యార్థం పూర్తిగా ఇస్తున్నాను.

* Social models : Blue Prints or Processes? by Graham R. Little Impact of Science on Society, 31 No. 4 Oct. - Dec. (1981) 439 - 447

# దేశభక్తి (గురజాడ)

దేశమును ప్రేమించుమన్నా
మంచిఅన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండికలిగితే కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్

అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మ వలెనోయ్
డబ్బు తేలేనట్టినరులకు
కీర్తిసంపదలబ్బవోయ్
వెనుక చూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుక బడితే వెనుకె నోయ్

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్

దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్

ఓర్వలేని పిశాచం దేశం
మూల్గులు పీల్చెసెవోయ్
ఒరులమేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్

పరులకలిమికి పొర్లియేడ్చే
పాపికెక్కడ సుఖంకద్దోయ్
ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్

స్వంత లాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశంమంటే మనుషులోయ్

చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలుగవలెనోయ్

మతం వేరైతేను యేమోయ్
మనసు వొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగి
లోకమున రాణించునోయ్

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్

ఆకులందున అణగి మణిగీ
కవిత కోయిల పలుకవలెనోయ్
పలుకులను వినిదేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్

పై గీతంలో థామస్ పెయిన్, బెంథాము, గాంధి భావాలు ఇమిడి ఉన్నాయి.
అహింస, సామరస్యం, విశ్వత్స సంఘం దీని లక్షణాలు. *(ఇంకావుంది)*

# ఆహారం - ఆరోగ్యం - వ్యాయామం

- సి.వి. సర్వేశ్వర శర్మ

అనారోగ్యంగా ఉండక పోవడమే ఆరోగ్యంగా ఉండడం అని భావించకూడదు. మానసికంగా, శారీరకంగా, సాంఘికంగా, నైతికంగా ఆరోగ్యంగా ఉంటే ఆరోగ్యంగా వున్నట్లు భావించాలి.

ఆరోగ్య జీవనానికి ప్రతివ్యక్తి సమతుల ఆహారం తీసుకోవాలి. తినే ఆహారాన్ననుసరించి మన ఆలోచనలు ఉంటాయి. మనం తినే ఆహారం శరీరానికి శక్తిని సమకూర్చడం, శరీర నిర్మాణానికి సహకరించడం, శరీరానికి రక్షణ కల్పించడం అనే మూడు రకాల బాధ్యతలు నిర్వహించాలి.

మనం తినే ఆహారంలోని పిండి పదార్థాలు, కొవ్వు పదార్థాలు శరీరానికి కావలసిన శక్తిని సమకూరుస్తాయి. పాలు, గుడ్లు, పండ్లు, ఆకుపచ్చని కూరలు, పప్పులు శరీర నిర్మాణానికి ఉపయోగపడతాయి. ప్రోటీనులు, విటమినులు, ఖనిజలవణాలు అధికంగా ఉండే ఆహార పదార్థాల శరీరానికి రక్షణ కల్పించడంలో కీలక పాత్ర వహిస్తాయి.

## మనం భుజించే ఆహారం

మనం భుజించే ఆహారంలో అయిదురకాల పోషక పదార్థాలు ఉంటాయి. పిండి పదార్థాలు, మాంస కృత్తులు, కొవ్వు పదార్థాలు, విటమినులు, ఖనిజపదార్థాలు.

బియ్యమువంటి ఆహార పదార్థాలలో పిండి పదార్థం అధికంగా ఉంటుంది. పప్పు దినుసులలో మాంసకృత్తులు ఉంటాయి. వంట నూనెల్లో కొవ్వు పదార్థాలు, పాలలో విటమినులు, ఖనిజపదార్థాలు వంటి పోషక పదార్థాలు ఉంటాయి.

పిండి పదార్థం, మాంసకృత్తులు; కొవ్వులు మనకు అధిక ప్రమాణంలో కావాలి. ఇవి దేహ పోషణకు తగినంత శక్తిని ఇస్తాయి. విటమినులు, ఖనిజ పదార్థాలు కొద్ది ప్రమాణంలో సరిపోతాయి.

## ఉత్తమ ఆహారం తయారు చేసుకోవడం

మనం రోజు వాడుకునే వరి, గోధుమలతో పాటు చౌకగా లభించే రాగి, సజ్జ, జొన్నలను వరితో లేదా గోధుమలతో మిశ్రమం చేసి వండుకున్నట్లయితే పౌష్టికాహారం దృష్ట్యా ఉత్తమం. కనీసం రెండు మూడురకాలను మిశ్రమం చేసి వండు కోవాలి.

కందులు, పెసలు, మినుములు, సెనగలు వీటిని పప్పులుగా తయారుచేసుకుని విడిగాకాక; రెండు లేదా మూడు పప్పులు కలిపి వండుకుని భోజనంలో తింటే మాంసకృత్తుల విలువలు మెరుగు పడతాయి.

బీట్రూట్, ముల్లంగి, కేరట్ వంటి దుంపల మొదళ్లలో వున్న ఆకులభాగాలను కూడా ఉపయోగించాలి. విటమినులు, ఖనిజాలు సమృద్ధిగా అందులో లభిస్తాయి.

సి.వి. శర్వేశ్వర శర్మ, ప్రెసిడెంట్, కోనసీమ సైన్సు పరిషత్, కృష్ణమూర్తి వీధి, అమలాపురం.

కొద్ది పరిమాణంలో పెరుగు లేదా మజ్జిగ తీసుకుంటే భోజనములోని మాంసకృత్తులపై వాటి ప్రభావం అమోఘంగా ఉంటుంది. వెన్న తీసిన పాలలో విటమిన్ 'ఎ' తప్ప మిగిలిన అన్ని విటమినులు, మాంసకృత్తులు, ఖనిజాలు ఉంటాయి.

**అయిదురకాల ఆహారపదార్థాలు**

ఆహారధాన్యాలు, వేళ్ళు దుంపలు మొదటిరకం; కాగా మాంసకృత్తులు లభించే ఆహారాలు రెండవ రకం; కొవ్వులు, నూనెలు, చక్కెర, బెల్లం మూడవ రకం.

పోషించి కాపాడే కూరగాయలు, పండ్లు నాల్గవ రకం, ఇందులో ఆకు కూరలు, పసుపు లేక నారింజ రంగుగల పండ్లు, కూరగాయలు మాత్రమే గాక విటమిన్ 'సి' పుష్కలంగా వున్న ఉసిరిక, జామ, ఉల్లిపాయ, నిమ్మ, బత్తాయి, టొమోటో వంటివి కూడా వుంటాయి.

ఇక ఇతర కూరగాయలయిన అంటే వంకాయ, బెండకాయ, కాకరకాయ, పొట్ల, బీర, పచ్చి అరటి, ములగకాడ వంటివి బాగా జీర్ణము కావడానికి, ఆహారానికి కరుకుదనాన్ని సమకూర్చేవి, ఐదవ రకం.

**వంట - ఒక ప్రణాళిక**

గృహిణి ప్రతిరోజు వంటను ఒకపథకం ప్రకారం చేసుకోవాలి. వంటకాల గురించి ఆలోచించినపుడు పై అయిదు రకాల ఆహార పదార్థాలున్నాయని గుర్తించుకోవాలి. వీటిని తగిన పరిమాణంలో ఉపయోగించాలి.

ఇలా తయారుచేసిన వంటకాలు పగటి వేళ ఉపయోగించాలి. ఆకుకూరలతో చేసిన వంటకం పగటి భోజనంలో కనీసం ఒకటయినా ఉండాలి.

ఆకు కూరలు విడిగా వండనవసరం లేదు. ఏ కూరలోనో, పులుసులోనో కలిపి వండుకోవచ్చు. వీటితో పాటు ప్రతిరోజు కనీసం ఒక్కసారయినా తరిగిన పచ్చికూర ముక్కలు లేదా ఏదైనా పండుగాని భోజనంలో వడ్డించాలి.

**వంట చేయడంలో మెళుకువలు**

ఆహారపదార్థాలు వండుకునేటప్పుడు వాటిలోని పోషకపదార్థాలు పాడవకుండా వంట చేసుకోవాలి. ఉదాహరణకు 'సి' విటమినుగల పదార్థాలను గాలి, వెలుతురు ఎక్కువగా సోకకుండా ఉంచుకోవాలి. అవి ఎక్కువగా సోకితే 'సి' విటమిను ఆ పదార్థాలలో నశిస్తుంది.

ఇటువంటి పదార్థాలను వండుకోవడం కన్నా పచ్చివాటినే పచ్చళ్లుగా వాడుకుంటే ఉత్తమం. దోసకాయలు, ఉల్లిపాయలు, కేరట్ దుంపలు, కొత్తిమిరి, చింతపండు, చింతచిగురు, కొబ్బరి వంటివి పచ్చి వాటితోనే పచ్చళ్ళు చేసుకోవాలి.

అన్నం వండుకునేటప్పుడు బియ్యానికి చాలినన్ని నీళ్ళు పెట్టుకుని వండుకోవాలి. ఎక్కువగా నీళ్ళుపోసి గంజి వార్చుకునే పద్ధతి అవలంబించకూడదు. ఇలా చేస్తే విలువైన విటమినులు, ఖనిజాలు వీటి నుండి కోల్పోవడం జరుగుతుంది.

తక్కువ నీటితో కూరగాయలను ఉడక పెట్టాలి. ఎక్కువ నీరు వాడకూడదు. వేయించడం వల్ల కూరగాయలలోని విటమిన్లు ఎక్కువగా నశిస్తాయి. ఆకు కూరలు వండేటప్పుడు అధికంగా నీళ్లు పోయకూడదు. వీటిలోనే నీళ్ళు ఉంటాయి.

ప్రెషర్ కుక్కరులో వంట తొందరగా కావడమే గాక ఆహార పదార్థాలలోని పోషక పదార్థాలు దెబ్బతినవు.

**పీచు పదార్థాలు :**

ఆహారంలో పీచు పదార్థాలు ఎక్కువగా ఉండాలని దాని వల్ల ఆరోగ్యం బాగుంటుందని, కోలన్ కాన్సర్, మధుమేహం రిస్కు తగ్గుతుందని, మల బద్ధకం నివారించ బడుతుందని వైద్య నిపుణులు గత మూడు దశాబ్దాలుగా చెబుతున్నారు.

ఇటీవల పరిశోధనలలో ఇది నిజం కాదని వెల్లడయ్యింది. అయినా పీచు పదార్థాలు వదిలవేయవద్దని ఆపరిశోధకులు హెచ్చరించారు. తృణధాన్యాలలో లభించే పీచుకన్నా పండ్లు, కూరగాయల ద్వారా లభించే పీచు మంచిదని తేల్చి చెప్పారు.

పండ్లలోను, కూరగాయలలోను శాలిసిక్ యాసిడ్ ఉంటుంది. ఇది వ్యాధి నిరోధక శక్తిగా ఉపయోగపడుతుంది. యాస్ప్రిన్‌లో ఈ రసాయనం కీలక భాగం అని గుర్తు చేశారు.

**నీరు తాగాలి**

శరీరానికి కావలసినంత నీరు తాగక పోతే శరీరంలో కొవ్వు అధికంగా పేరుకు పోతుంది. కండరాల పటిష్టత దెబ్బతిని, జీర్ణ సమస్యలు ఎదురవుతాయి.

మూత్రపిండాలు యూరికామ్లం, యూరియాలను తొలగిస్తుంది. అవి తరువాత నీటిలో కరగాలి. ఈ రద్దు పదార్థాలు తొలగాలంటే తగినంత నీరు తాగాలి. అలా తాగక పోతే ఈ రద్దు పదార్థాలు శరీరం నుండి పూర్తిగా తొలగక మూత్రపిండాలలో రాళ్లుగా తయారవుతాయి.

ఎక్కువ నీరు తాగకపోతే శరీరంలోని రద్దు పదార్థాల విష ప్రభావానికి మనిషి మరణిస్తాడు. తగినంత నీరు తాగితే శరీరం బరువు కూడా తగ్గుతుంది. ఆరోగ్యకరమైన మనిషి రోజుకి కనీసం ఎనిమిది నుండి పది గ్లాసులు (పావులీటరు) నీరు తాగాలి. వ్యాయామం చేసేవారు, వేడి వాతావరణంలో నివసించే వారు ఇంకా ఎక్కువగా నీరుతాగాల్సి ఉంటుంది.

నీరు ఎక్కువగా తాగితే బాత్‌రూమ్‌కు తరచు వెళ్లాల్సి వస్తుంది కదా? అని అనుమానం రావచ్చు. కాని నీరు అధికంగా తాగడం మొదలు పెట్టిన కొద్ది వారాలలోనే బ్లాడర్ సర్దుబాటు అవుతుంది.

ఎక్కువసార్లు బాత్‌రూమ్‌కు వెళ్లాల్సిన అవసరం ఉండదు. కాకపోతే వెళ్ళినపుడు ఎక్కువ పరిమాణంలో నీరుడు అవుతుంది.

**వ్యాయామం**

వ్యాయామం చేయడం వల్ల శారీరక ఆరోగ్యం అభివృద్ధిచెందడమే కాదు మానసికంగా ఉల్లాసం లభిస్తుంది. అందుకే మన ఆరోగ్య పరిరక్షణలో వ్యాయమం ఒక ముఖ్యమైన అంశం.

వ్యాయామంలో నాల్గు రకాలయినవి వున్నాయి. అవి ఐసోటోనిక్స్, ఐసోమెట్రిక్స్, అనిరోబిక్, ఈరోబిక్స్. కసరత్తు, బరువులు ఎత్తడం వంటివి ఐసోటోనిక్స్ వ్యాయామంగా వస్తాయి.

యోగాసనాలు వంటివి ఐసోమెట్రిక్ వ్యాయమంగా వస్తాయి. పరుగు పందాలవంటి వాటిలో పాల్గొనే వ్యాయామం అనిరోబిక్స్ వ్యాయామం అవుతుంది.

నడక, నెమ్మదిగా పరుగెత్తడం ( జాగింగ్) వంటివి ఈ రోబిక్స్ వ్యాయామంగా వస్తుంది. ఇటువంటి వ్యాయామం చాలాసేపు చేయవచ్చు. ఈ వ్యాయామంలో ఆక్సిజన్ శరీరంలోని టిష్యూ కణాలకు అందడం అది ఆహారంతో కలసి శక్తిని విడుదల చేయడం జరుగుతుంది.

శరీరంలోని అన్ని భాగాలకు రక్తాన్ని తీసుకు పోయే రక్తనాళాలు వ్యాయామం చేయడం వల్ల ఆరోగ్యంగా వుండి వాటి పనిని ప్రతిభావంతంగా చేయగల్గుతాయి. వ్యాయామం చేయని మనిషి శరీరంలో రక్త నాళాలు చురుగ్గా ఉండవు. అత్యవసర సమయాల్లో అవి శక్తికి మించిన పని చేయలేవు.

క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం వల్ల ఊపిరి తిత్తులు కావలసినంత ఆక్సిజన్‌ను పీల్చుకుని శరీరానికి అందిస్తుంది. నియంత్రిత, అనియంత్రిక కండరాలన్నింటికి వ్యాయామం వల్ల పరోక్షంగా శక్తి లభిస్తుంది.

పగలంతా బోలెడంత కష్టపడి పని చేస్తాం మాకు వ్యాయామం ఎందుకు? అనేవారున్నారు. వంటింట్లో ఎన్నోసార్లు వంగుని నుంచుంటాం ఇంతకన్నా వ్యాయామం ఏమిటి? అనే మహిళలు వున్నారు. వీటి వల్ల కొన్ని శరీర భాగాలకు మాత్రమే కదలిక ఉంటుంది, ఇతర శరీర భాగాలకు ఎటువంటి వ్యాయమం ఉండదని వారు గుర్తుంచుకోవాలి.

**వ్యాయామం - ఆరోగ్యం**

అనుదినం వ్యాయామం చేయడం వల్ల శరీరంలో మెటబాలిక్ రేటు పెరుగుతుంది. మనిషి భంగిమ ఎలా వున్నా తట్టుకునే శక్తి, నరాలు- కండరాలు - పని సామర్థ్యం పెరుగుతుంది.

వ్యాయామంలో వార్మింగ్ అప్, ప్రత్యేక కండరాల సముదాయానికి నిర్దేశించిన వ్యాయామం, శరీరం ఓర్చుకోగల్గినవి, వంగిచేసేవి, శరీరాన్ని సాగదీసేవి, రిలాక్సింగ్ వ్యాయామాలు ముఖ్యమైనవి.

వ్యాయామం చేసేవారు తమ నాడి కొట్టుకునే రేటు హద్దుల్లో ఉండేటట్లు చూసుకోవాలి. 50 ఏళ్ళ వయసు కలిగిన వారు హద్దు ఇలా తెలుసుకోవాలి. 220-50=170. ఇందులో 70 శాతం 119

ఇది వారి హద్దు. అంటే వారి నాడి కొట్టుకునే రేటు 119కి దాటకూడదు. యాభయి ఏళ్ళు దాటిన వారు గుర్తుంచుకోవాల్సిన విషయాలు.

**ఏమి చెయ్యాలి ?**

◆ ఆరోగ్యానికి సరిపడే వ్యాయామం ఎన్నుకోవాలి. వ్యాయామం తగినంత ఉండాలి. అధికమైతే నిరుత్సాహం, శ్రమ మిగులు తాయి.

◆ వ్యాయామం పొడిగించేదిగా ఉండాలి. హాయిగా వుండే విధంగా వ్యాయామం ప్రారంభించి క్రమంగా ఎక్కువ సమయానికి కొనసాగించాలి. ఆరోగ్యం బాగుండాలంటే క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. వ్యాయామంలో అలసట అన్పిస్తే వ్యాయామం చేసే జోరు తగ్గించాలి.

◆ మత్తుగావున్నా, కళ్ళు తిరుగుతున్నట్లున్నా వ్యాయామం చేయకూడదు. వ్యాయామం ఎవరితోను పోటీగా చేయకూడదు. శ్రమ అనిపిస్తే ఆగిపోవాలి. ఇతరులు వెళ్ళి పోతున్నారని ఆందోళన పడకూడదు.

◆ నొప్పి, అసౌకర్యం కల్గించే ఏ వ్యాయామం చేయకూడదు.

**సహజ వ్యాయామం**

◆ ఎలివేటర్‌కు బదులు మెట్లు ఎక్కిపై అంతస్థులకు వెళ్లడం అలవరుచుకోవాలి.

◆ అనుదినం చకచకా నడుస్తూ వాకింగ్ చేయాలి. నడవగలిగితే కారును వాడవద్దు.

◆ చకచకా నడవగలిగే వారు మెల్లిగా నడవకూడదు.

◆ వాకింగ్‌కు స్నేహితునితో వెళ్లవచ్చు.

**చేయవద్దు !**

◆ మోకాళ్ళు వంగకుండా నడుం వంచి కాలివేళ్లను ముట్టుకోకూడదు. దీని వల్ల నడుం మీద పీడనం పెరుగుతుంది. ఇది చేయదలచుకున్నవారు మోకాలు వంచవచ్చు.

◆ ఎక్కువ రక్తపోటుగలవారు బరువులు పైకి ఎత్తడం, పుష్ అప్‌లు చేయకూడదు.

◆ గెంతడం, ఎగరడం వంటి వ్యాయామాలు చేయడం వాంఛనీయం కాదు. ఎందుకంటే ఇటువంటి వాటివల్ల శీలమండ, మోకాళ్ళు, పిరుదుల వద్ద కీళ్ళుబాగా ఒత్తిడికి గురైనొప్పి పుడతాయి.

◆ కూర్చుని కాళ్ళు చాచి మోకాళ్లవైపుకు తల వంచినపుడు మోకాళ్ళు పైకి లేపుకోవచ్చు. మోకాళ్లు కదల కుండా నిటారుగా వుంచి వంగడం అలవాటు చేసుకోవాలని మొండిగా ప్రయత్నించ కూడదు. నడుం కింద భాగంలో పీడనం అధికమయి నొప్పికల్గుతుంది.

◆ వంగిన భంగిమ నుండి త్వరితంగా మామూలు భంగిమకు వచ్చే ప్రయత్నం మంచిది కాదు. ఒకొక్కప్పుడు ఇటువంటి ప్రయత్నాలు మనిషిలో తల తిప్పడం వంటి దుష్ఫలితాలు తెచ్చి పెడతాయి.

# రెండు పరాజయాలు - ఒక విజయం

- జూకంటి జగన్నాథం

కవిత్వం ఒకానొక స్పందన నుంచి మొదలై చింతన, తాత్వికత, సామాజికతల భూసార పరీక్షల వాదాల ఉద్యమాల మీదుగా కదలబారి తారాస్థాయికి చేరుతుంది.

అలాగే ఈ సందున వచ్చిన అఫ్సర్ 'వలస' కవితా సంకలనాన్ని ఒకసరి పైన వివరించిన భూమిక నేపథ్యంగా అవలోకన చేద్దాం.

పెట్టుబడి కేంద్రీకృతం అయిన చోటుకు వలసలు నిరంతరంగా కొనసాగుతాయి. కుల వృత్తులు అన్నీ విధ్వంసం అయిపోయి, కొన ఊపిరి నిరుద్యోగంతో విలవిల్లాడుతూ పనికోసం ఉన్న ప్రదేశం నుంచి మరో దగ్గరికి ప్రయాణిస్తాయి. తరలిపోతున్న ఆయా వృత్తులను ఆశ్రయించిన ప్రజల జీవన యానంతోబాటు సంస్కృతి సకల కళా సంపదలు కూడా తట్టాబుట్ట సర్దుకు ఉద్యుక్తమవడం ఎంత సహజమో ఆక్రమంలో నిర్మాణాత్మక కళా ప్రక్రియలన్నిటికీ కాళ్ళు రావడం అంతే సహజాతి సహజం.

కేంద్రబిందువు చుట్టూ జనం పరిభ్రమించినట్టే కళలన్నిటిలోకి ముందుగా సున్నిత హృదయ సంబంధి కవిత్వం వలస మజిలీలుగా చేస్తుంది. మనిషి సామాజిక బౌద్ధిక చలనా చలన గతిలో విలువల కదలికలు వేగంగా నిరాకారం అయిపోతాయి. చెట్టును కొట్టేసిన మొదలుగా కవిత్వం పచ్చదనం ఖాళీని వెక్కిరిస్తుంది. నొసలు కొట్టుకు ఎల్లెడలా వెక్కి వెక్కి ఏడుస్తుంది. గుణాత్మకంగా రెండు పాయలుగా సాహిత్యం రూపాంతరం చెందుతుంది. ఒకటి సంక్షోభాన్ని క్రమపరిణామ పరిక్రమాన్ని అర్థం చేసుకున్న అక్షరాలు బాధ వెలుగులో కాంతి పుంజమవుతుంది. రెండోది పెనుగులాట లేని అక్షరమక్షరం యాంత్రికతతో కృంగి కృశించి ఈసురోమని కుంటుతుంది. సజీవ నిర్జీవ సాహిత్యాల సంఘర్షణ కొనసాగుతుంది.

సరిగ్గా తెలుగు కవిత్వంలో ఈ రెండు రకాల మనోభావనల సంఘర్షణ 1980 ప్రాంతము నుంచే మదన పడడం మొదలైంది. సన్నగా ప్రారంభమైన అలజడి దళిత స్త్రీవాదాలు కొంచెం ఆలస్యంగా మైనారిటీ వీచికలుగా పరివ్యాప్తమై 1990 ప్రాంతం వచ్చే వరకు అమాహనా గమనాన్ని అందుకుంది.

చెదురు మదురు సంఘటనలు తప్ప ఉద్యమ ఆలంబన లేక ఆయా కవిత్వ వాదాలు అంగికాన్ని వెల్లడించాయే తప్ప హృదయ వైశాల్య అట్టడుగు అంతరంగ 'లబ్‌డబ్'లను ఆశించిన మేరకు ముట్టుకోలేకపోయాయి, అని ఈ వాదాలేాక 1970 దశకం నుంచి సాహిత్యాన్ని మాదని గర్వంగా చెప్పుకునే విరసం లాంటి సంస్థ కవులు, రచయితలు, కళాకారులు, అధినాయకులు ఈ మార్పును అంగీకరించక, లేక ఆలస్యంగా ఆమోదించినా మూస సాహిత్య సృజన నుంచి అంత తొందరగా మింగుడు పడక, విడువడలేక ఇముడలేక కొనసాగుతున్నారు. అంతరంగికులు, ఏకీభవించేవారు

---

జూకంటి జగన్నాథం, సిరిసిల్ల

చాలమంది చట్రం నుంచి బయట పడదామనుకున్నా గతకాల అవశేషాలుగా మిగిలి ప్రవాహ వేగాన్ని అందుకోలేక ఇసుక మేటలో కూరుకు పోయిన మర పడవలై పోయారు. ఆయా రచయితలు వెలువరించిన కవితా సంకలనాలను సంపాదకత్వంలో విడుదలైన సంపుటులను చూస్తే కవిత్వంలో Insider గా కన్నా Out sider గానే ఎక్కువ ఉనికి గోచరిస్తుంది.

మౌలికంగా కవిత్వం డిటాచ్డ్ Watchdog గా రూపాంతరం చెంది మొనాటనీగా మారింది. పదునెక్కిన వాదాల కవిత్వంలో ఆగామి దృక్కోణాన్ని మరచి గతించిన లేక వర్తమాన జీవితాన్ని ఆస్వాదిస్తూ కులవృత్తి మార్పును గమనించక ఫక్తు షోకేస్ లాంటి గత జీవితాన్ని ఎక్కువగా కవిత్వీకరించడమే జరిగి ఉద్యమ వెన్నూదన్నూలేక స్మృతి చిహ్నంగా నిలిచింది.

ఇకపోతే స్త్రీవాద కవిత్వం మిగులు సమయం, మిగులు సంపద కలిగిన Upper Middle Class చుట్టూ రచయిత్రుల కలాల నుంచి ప్రవహించి అట్టడుగును వర్ణిస్తే జీవితం లోతుల్ని స్పృశించ లేకపోయింది.

ఈ వాదాల వెలుగు తెలుగు కవిత్వంలో కొత్త ఆలోచనా వీచికల్ని మోసుకొచ్చినా ఆచరణలో ఆశించిన శిఖరాలను అందుకోలేక ఒక విధంగా ఒక మోస్తరు వైఫల్యం గోచరిస్తుంది. అనుభవిస్తున్న జీవితం గతించిన బతుకు ఘర్షణల తాలూకూ కళామూల్యాల్ని సమర్థవంతంగా మలచ లేకపోగా ఆయా కులాలు మిగిల్చిన శకలాల్ని కవిత్వం భుజకీర్తులుగా భావించడం ద్వారా తన స్థానాన్ని బలంగా Locate చేసుకోవడంలో నిశ్శబ్దాన్ని పాటించాయి. ఇది ఇలా వుంటేమరోవైపు ఉత్పత్తి సంబంధాలలో గణనీయ మార్పులు సంబవించి వ్యష్టి ఉపరితల అంశాలు తీవ్ర ఆటుపోట్లకు లోనవ్వడం మొదలైంది.

సరిగ్గా ఈ సందర్భంలోనే కవులు తమ సామాగ్రి విషయంలో ఆచితూచి వ్యవస్థీకృత బీభత్సాన్ని అతి సూక్ష్మస్థాయిని కవిత్వంలో స్వచ్ఛంగా నిజాయితీగా చిక్కగా వడకట్టారు.

ఇదిగో ఈ గుణాత్మక క్రమంలో 90 వ దశకం మధ్యలో రాసిన కవిత్వాన్ని అఫ్సర్ 'వలస' గురుతర సంకలనంగా ఇటీవల తీసుకువచ్చాడు.

ప్రతి కవి అక్కడక్కడా అప్పుడప్పుడూ చలించి రాసినా, కవుల సంకలనాల ద్వారా మాత్రమే సరిగ్గా మదింపు (Evoluation) చేయగలుగుతాము. 'వలస' సంకలనంలో 75 కవితలలో ఒక అనువాద కవిత కూడా చోటు చేసుకుంది.

జీవితంపై బలమైన ప్రభావాల్ని చూపే సుఖ దుఃఖాలు, బలాలు బలగాలు, ఇష్టాయిష్టాలు తదితర అంశాలన్నింటినీ కవిత్వంలో శతాబ్దపు చిట్టచివరి దశకంలో ప్రతిఫలించడం ద్వారా పరిపుష్టత కలిగింది. కవిత్వం నడక ఊగుతూగు గతంలోని పునరుక్తి, వక్తృత్వం తదితరాలు కనిపించవు కవి 'చీకటైన దీపానికి' కవితలో 'వొకే వొక్క వూపిరి తేడాతో' ప్రారంభించి 'నీ రెండు చేతులా నీ నిండు దేహాన్ని

నువ్వే చిదిమేస్తున్నప్పుడైనా తెలిసిందా' అంటూ చాక్‌మర్‌తో మెల్ల మెల్లగా పెన్సిల్‌ను చెక్కుతున్నట్లుగా గుండె లోతుల్ని తడుముతుంటుంది.

కవిత్వా ఒక భావం రూపు దిద్దుకునే ముందు భాష సొంతగొంతును సవరించుకోవాలి ''ఎప్పటికీ తెల్లారని ఆ భూమ్మీదికి - నన్నెప్పటికీ పంపకు'' 'నది దాచుకున్న పడవ' లో అంటాడు.

'కాలం నిర్దాక్షిణ్యంగా తన్నుకుపోతే
లోపల ఎన్ని కెరటాల కలవరింత'

' ఒక సంతూర్ వానచినుకు కోసం'

' ఏటి కడుపున తల దాచుకున్న ఆకాశం'

'చీకటి వాకిళ్ళు వెలుగు పుప్పొడి ముగ్గులు తీర్చుకుంటాయి'

నిర్మించబడిన సంధించబడిన తీరులో వినిర్మాణం అనేక కవితలు పొందుతుంది. 'ఊరవతలి దుఃఖం' కవితలో ''నిన్ను ఎలాగైనా సుఖపెట్టడానికి'' నా కవిత్వం

''ఈ దేశపు రాజ్యాంగం కాదు'' రాజ్యం దాని తైనా తీనా అయిన రాజ్యాంగం మీద వ్యవస్థ గుండెల్లో ప్రకంపనలు పుట్టిస్తాడు.

నిశ్శబ్ద చూపుల సంభాషణను, ప్రతిక్షణం అదే ఆఖరి క్షణంగా
అంతే శబ్దరహితంగా 'నిజమేలే గుర్తు సాగిపోతుంది'

చివరి గాయంగా బతుకుతున్న వాళ్లం
''కాస్త తలెత్తె నివ్వు
ఇక్కడో ఆకాశాన్ని వేలాడదీయాలి
దారికోసం''

'వలస' కవితల్లో చాలమట్టుకు అఫ్సర్ తన హృదయ స్పందనల్ని అత్యంత ప్రతిభావంతంగా అనితరంగా నమోదు చేసాడు.

అంతేగాక మార్కెట్ ఎకానమీని డిసెంబర్ 5 తర్వాత పరిస్థితిని మైనారిటీ కవిత్వాన్ని కొన్ని కవితల్లో విప్పి చెప్పినా పెద్దగా పండలేదు.

ఎందుకంటే కవి విశాల దృక్పథం కొన్ని కవితల్లో స్కేళ్లమధ్య వెలితిగా వున్నాయి. అఫ్సర్‌లో తాత్వికత జీవితసారం పతాకస్థితి కనిపిస్తుంది.

''సూర్యుడు పొడిచిన వెలుగులో
మరణం చివరిస్నానం గురించి ఆలోచిస్తూ వెళ్లాలిక'' (చివరి స్నానం)

జీవితంలో శిశిరం రాజ్యమేలుతున్న రాలుతున్న కాలంలో నిమ్మచెట్టు హరిత స్వప్నధ్యాన ధ్యాస.

''విరిగిన కిటికీ రెక్కలపైన
తడిసిన బూడిదరంగుకి మళ్లీ నీ పొట్టి చెక్కిళ్లపైన
ఒక్కటంటే ఒక్క లేతాకు పచ్చనవ్వు
తలకిందులుగానైనా మెరవనీ'' (ఆకుపచ్చ ఆకాశం)
ప్రవాహగమనమే కవిత్వం - ప్రవాహగుణమే కవిత్వం
నిశ్చిత అభిప్రాయం గల కవి
ఎటో
వొకవైపు
అడుగు పడనీ
అడుగు లోనే
ఆకాశం కనపడనీ (వెళ్ళిపోతూ)
కదలడమే జీవితం - ఆగిపోవడం మరణం.

అయితే ముడికట్టుకు పోయేబదులు అడుగు పడాలనీ ఆ అడుగులో ఆకాశం కనబడాలనడం కవి కన్రెప్పలు తూర్పు పడమరలంత లోతైనవి మరి.

దళిత స్త్రీ వాద మైనారిటీ కవిత్వాల గొంతు బొంగురు పోతున్న సమయంలో అఫ్సర్ 'వలస' సంకలనాలలో తెలుగు కవిత్వంలోకి అన్ని చట్రాల్ని పటాపంచలు చేస్తూ ఒక తనదైన కిటికీ తెరిచాడు. కవిత్వం మాటలకు మిరియాల కషాయం కవిత్వాన్నిచ్చి గొంతు ఉపశమనాన్ని శ్వాసకు స్వచ్ఛతను కూర్చాడు.

అంతేగాక చివరన రాసుకున్న 'నాస్టల కాలాల్లోకి.....' తో తన దృక్కోణాన్ని నేటి అనేకానేక సంక్షోభాలకు, క్షోభలకు తెగిపోతున్న విషాదాలకు మధ్య అఫ్సర్ లాంతరు వెలిగించాడు.

'చీలిపోతున్న దారుల్లో గమ్యం గురించి అడక్కు' వాక్యంలోని ప్రతిపాదనను అందరు గమనించాలి - విస్తృతిని విశాలత్వాన్ని వియోగ యోగాల నడుమ జీవితాన్ని కవిత్వంతో పునీతం చేయాలనే తపస్సు నిభిడీకృతమై వుంది. అంతే.

వ్యక్తి బతుకు, సమూహం జీవితం అపజయం సంకేతాలు విరజిమ్ముతున్న దశలో 'వలస' కవిత్వం సాధించిన ప్రతిఫలనాలు వెరసి విజయ బేరీజు సంకీర్తనం.

ఆధునిక భావజాలం అత్యాధునిక (Bites) శరవేగాన్ని అందుకుంటున్న సందర్భంలో 'వలస' కవిత్వం గుండె చప్పుళ్ళను సమర్ధవంతంగా నమోదు చేసింది. జీవితంలోని లోతట్టు ప్రాంతాల్ని అనేకాల్ని నిలువెత్తుగా నిలిపింది. బేజారైన మనుసులకు కవిత్వ స్పర్శ అనితర చికిత్స ఉపశమనమైంది.

# రంగులూ... ప్రభావాలూ !

– మాకినీడి సూర్యభాస్కర్

కొత్త బట్టల సెలక్షన్. షాపులో ఒక అరగంటపాటు రకరకాల తానుల్ని తీయించి, చివరికి ఒక డిజైన్ బాగుందని సెలక్టు చేస్తాం. అది కట్ చేయమని చెప్పేముందు గుర్తుకొస్తుంది, రంగు. ''ఈ డిజైను ఫలానా రంగులో ఉందా?'' అని అడుగుతాం. ఇది ఎవరి విషయంలోనైనా తప్పనిసరి. ఎందుకంటే, ఒక్కొక్కరికి ఒక్కో రంగు యిష్టమవుతుంది. మనిషి తనకే రంగు యిష్టమైతే, ఆ రంగు బట్టల్ని ధరించడానికి యిష్టపడతాడు. ఇంటికి ఆ రంగు(ల)నే వేయించుకుంటాడు. ఇంట్లో వాడే కర్టెన్లు, బెడ్‌షీట్లు వగైరా వస్తువులన్నీ ఆ రంగువే కొంటాడు.

అయితే, ఈ రంగులనేవి మనిషి మనుగడపై ఎంతో ప్రభావాన్ని కలిగిస్తాయంటున్నారు. మనో వైజ్ఞానిక శాస్త్రవేత్తలు. ఒక రంగు, దాని ధర్మం ప్రకారం, మనిషి ప్రవర్తనను ప్రభావితం చేస్తుందంటున్నారు. షేడులు మూడులు మారుస్తాయనీ, కొన్ని రంగులు జబ్బులను పెంచితే, మరికొన్ని తగ్గిస్తాయనీ వారంటున్నారు. ఈ దృగ్విషయమాధారంగా 'క్రొమాటో థెరపీ' (chromato therapy) అనే వైద్య ప్రక్రియ ఆవిర్భవించింది. ఈ విషయాలు తెలుసుకునే ముందు, రంగుల గురించి కొంత తెలుసుకోవాలి.

దృశ్య జగతిలో మనం ఒక వస్తువును చూస్తున్నామంటే, దానికి కారణం రంగు. చెట్టు పచ్చగా, పూలు ఎర్రగా, ఆకాశం నీలంగా ... యిలా అన్ని వస్తువుల్నీ మనం వాటికున్న రంగులవల్లనే గుర్తిస్తాం. కొన్ని వస్తువులు ఒకే రంగులో ఉంటే కొన్ని రెండు రంగుల్లోను, మరికొన్ని మూడు, అంతకన్న ఎక్కువ రంగుల్లోను ఉంటాయి. ఇంద్ర ధనస్సు ఏడురంగుల్లో (vibgyor) - నీలి, నీలం, ఆకుపచ్చ, పసుపు, నారింజ, ఎరుపు రంగుల్లో ఉంటుంది.

ఏ ఇతర రంగులను కలిపినా పొందలేని రంగులను ప్రాథమిక రంగులంటున్నారు. అంతేకాక, ఏ రంగుల కలయికతో మనకు కావలసిన ఇతర రంగులను పొందగలమో అవి ప్రాథమిక రంగులు. మొదట్లో ఎరుపు, పసుపు, నీలాలను ప్రాథమిక రంగులుగా భావించేవారు. అయితే, ప్రస్తుతం నీలం రంగు బదులు ఆకుపచ్చను ప్రాథమిక రంగుగా గుర్తించారు.

మూడు ప్రాథమిక రంగుల కలయికతో మనం కొన్ని వేల రంగులను పొందగలం. రెండు ప్రాథమిక రంగులను కలపగా వచ్చిన రంగును ద్వితీయ లేదా గౌణవర్ణం అంటారు. ఎరుపు-నీలం కలిస్తే ఊదారంగు; నీలం-పసుపు కలిస్తే ఆకుపచ్చ; ఎరుపు-పసుపు కలిస్తే నారింజరంగు వస్తాయి. అంటే, ఊదా, ఆకుపచ్చ, నారింజలు ద్వితీయ వర్ణాలు. రెండు ద్వితీయ వర్ణాలను కలిపితే వచ్చే రంగులను తృతీయ వర్ణాలంటారు. ఆకుపచ్చ-నారింజ కలిస్తే సిట్రాన్; నారింజ-ఊదా కలిస్తే రసెట్; ఊదా-ఆకుపచ్చ కలిస్తే ఆలివ్ రంగులు వస్తాయి. అంటే సిట్రాన్, రసెట్, ఆలివ్‌లు తృతీయ వర్ణాలన్నమాట. ఇవి కాక, ప్రాథమిక వర్ణాలను ద్వితీయ వర్ణాలతో కలిపితే వచ్చే రంగులు 'మధ్యస్థ వర్ణాలు' (intermitant colours) . పసుపు-ఆకుపచ్చలను కలిపితే పీతహరితం లేదా హరితపీతం వస్తాయి. పసుపు ఎక్కువైతే పీతహరితం; ఆకుపచ్చ ఎక్కువైతే హరితపీతం. అలాగే తక్కినవన్నీ. ఆకుపచ్చ-నీలం రంగులను కలిపితే హరితనీలం, నీల హరితాలు వస్తాయి. నీలం-ఊదాలను కలిపితే నీలి ఊదా, ఊదా నీలాలు వస్తాయి. ఊదా-ఎరుపు రంగులు కలిపితే ఊదా ఎరుపు, ఎర్రని ఊదా వస్తాయి. ఎరుపు-నారింజ రంగులు

---

ఎమ్.ఎస్. భాస్కర్, ప్రముఖ చిత్రకారుడు, రచయిత, కాకినాడ.

కలిపితే ఎర్రనారింజ, నారింజ ఎరుపు రంగులు వస్తాయి. అలాగే నారింజ-పసుపు రంగులను కలిపితే నారింజ పసుపు, పసుపు నారింజ రంగులు వస్తాయి. ఇవన్నీ మిశ్రమ వర్ణాలు. ప్రాథమిక రంగుల సంయోగ సమ్మేళనాలతో లభించేవే 'మిశ్రమ వర్ణాలు' (Mixed colours). ప్రాథమిక రంగులు సమపాళ్ళలో కలిస్తే తెలుపు; ఏ రంగూ లేకపోవడమే నలుపు.

రంగుల మిశ్రణ గురించి ఇంత విపులంగా చెప్పడమెందుకంటే, వీటన్నింటికీ మాతృకలైన ప్రాథమిక రంగుల స్వభావాలు. ఈ రంగులకూ వాటి ఆంశిక నిష్పత్తిని బట్టి సంక్రమిస్తాయని తెలిపేందుకే.

రంగులన్నింటినీ ఉష్ణ, శీతల వర్ణాలుగా విభజించవచ్చు. ఎరుపు, పసుపు, నారింజ, ఊదారంగులు, వాటి మిశ్రమ వర్ణాలను ఉష్ణ వర్ణాలంటారు. నీలం, ఆకుపచ్చ, హరిత నీలం, నీల హరితం, వీటి మిశ్రమ రంగులను శీతల వర్ణాలంటారు. బూడిద లేదా ధూసరవర్ణం ఉష్ణశీతలాలు రెంటికీ చెందుతుంది. ఇది ఉష్ణ ధూసరమనీ (తెలుపు పాలు ఎక్కువైతే), శీతల ధూసరమనీ (నలుపు పాలు ఎక్కువైతే) రెండు రకాలు.

రంగుకు రంగుకు సంబంధమేమిటంటే, ఉష్ణవర్ణాలకు ఉష్ణవర్ణంతోను, శీతల వర్ణాలకు శీతల వర్ణంతోను సామరస్యం ఉంటే; ఉష్ణ వర్ణాలకు, శీతల వర్ణాలకు మధ్య అనైక్యత ఉంటుంది. సామరస్యం కల రంగులను ఒకదానికొకటి పూరకం అంటారు. ఎరుపుకు ముదురు ఆకుపచ్చ, నీల హరితాలు పూరకాలు. నారింజకు హరితనీలం, పసుపు, నీలం; ఆకుపచ్చని పసుపు (హరిత పీతం) కు ఊదా; ఆకుపచ్చకు లేత ధూసరం; ఊదాకు లేత ఆకుపచ్చ రంగులు పూరకాలు. పూరక వర్ణాల విన్యాసం కంటికి యింపుగా ఉంటుంది. అందుకే, నేడు అధిక ప్రాధాన్యం సంతరించుకున్న ఇంటీరియర్ డెకరేషన్‌లో ఈ రంగుల విజ్ఞానం అత్యంత ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది.

ఒక రంగు వాతావరణంలోని మార్పుల ననుసరించి కొంత విభిన్నంగా గోచరిస్తుంది. ఎండగా ఉన్నప్పుడు లేతగాను, నీడలో ముదురుగాను, రెండు లేనప్పుడు మధ్యస్థంగాను కనబడుతుంది. అందుకే వివిధ వాతావరణాల్లో నివసించేవారు వివిధ రంగులను యిష్టపడతారు. చలిదేశాలలో నివసించేవారికి ఎరుపు, పసుపు, నారింజ వంటి ఉష్ణవర్ణాలు హాయినిస్తే, ఉష్ణదేశాల ప్రజలకు నీలం, ఆకుపచ్చవంటి శీతల వర్ణాలు హాయినిస్తాయి. వాతావరణంలోని వేడిమి / కాంతి లేదా చల్లదనం - వాటికి విరుద్ధమైన రంగులతో ఉపశమిస్తాయి. అందుకే ఆయా వాతావరణాల్లో ఉండే ప్రజలు ఆయా రంగులను యిష్టపడతారు.

ఒక పాటను సాదాగా చదివినప్పుడు దాని భావం అర్థమవుతుంది. అంతే, కేవలం భావమే. అదే మంచి రాగంతో పాడితే, భావంతో పాటు హృదయంలో అనుభూతుల్ని కూడా రేపుతుంది. పాటను చదవడానికీ, పాడడానికీ అంత తేడా ఉంది. అలాగే, చిత్ర రచన కూడా. గీతలతో చిత్రించిన బొమ్మ నిసర్గ సౌందర్యంతో అలరారుతూ భావాన్ని విశదపరుస్తుంది. దానికి రంగుల్ని కూడా పులిమినప్పుడు హృదయంతో అనుభూతుల్ని రేకెత్తిస్తుంది. పాటకు రాగం లాంటిది, చిత్రానికి రంగు. రాగం శ్రవణ సంగీతమైతే, రంగు దృశ్య సంగీతం.

వర్ణాల శక్తి వర్ణనాతీతం. వాటి ప్రభావం మన మనసులపై ఎంతైనా ఉంటుంది. ఏపుగా పెరిగిన పచ్చగడ్డిపైన పడిన మంచు బిందువులో ఉదయ భానుని అరుణ కిరణాలు వికిరణం చెంది మంచు బిందుపై ప్రతిఫలించిన చిన్న ఇంద్రధనువును చూస్తే ఎవరికి ఆహ్లాదం అనిపించదు? అర్థ రాత్రి అర్థంతరంగా లేస్తే కనిపించే నల్లని కారుచీకటి ఎవరిని భయపెట్టదు? దీన్ని బట్టి రంగు మనకు

ఆనందాన్నో, భయాన్నో ... ఏదో క సంవేదనను కలిగిస్తుందనడంలో అతిశయోక్తి ఏముంది? రంగు కలిగించే ఈ సంవేదనలతో మన మనసుపై వాటి ప్రభావం ఉంటుంది. వివిధ రంగుల ప్రభావాలు మనసుపై ఎలా ఉంటాయో చూద్దాం. ఆలోచన, నడవడిక వంటి విషయాల్లో వైయక్తిక భేదాలుంటాయి. వ్యక్తులు యిష్టపడే రంగులను బట్టి ఆయా వ్యక్తుల మనోభిప్రాయాలు, స్థాయీ భేదాలు, స్థితి గతులూ తెలుస్తాయని, అంటున్నారు వర్ణ విశ్లేషకులు. అంతే కాకుండా, శరీరం చుట్టూ ప్రతి మనిషికీ ఒక కాంతి వలయం (Aura) ఉంటుంది. దాన్ని 'కిర్లిన్ ఫోటోగ్రఫీ' అనే ప్రత్యేకమైన ఛాయాచిత్రణ ద్వారా గుర్తించవచ్చు. ఒక మనిషికి ఏదైనా జబ్బు ఉంటే, ఆ మనిషి జబ్బు పడిన భాగానికి చెందిన ఆరాలో రంధ్రాలు గాని మచ్చలుగాని కిర్లిన్ ఛాయాచిత్రంలో కనిపిస్తాయి. అయితే, కొన్ని రంగుల ప్రభావంతో క్రమేపీ ఈ ఆరాలోనున్న మచ్చలు మాయమైనట్లుగా గుర్తించబడింది. ఫలితంగా ఆ మనిషికి ఆ జబ్బు నమయయింది. ఈ రకంగా వివిధ రంగులు మన శరీరం చుట్టు ఉండే ఆరాను ప్రభావితం చేసి వివిధ రోగాలను పెంచడం లేదా తగ్గించడం చేస్తాయని పారాసైకాలజిస్టులు భావిస్తున్నారు. ఈ భావన నుంచే 'క్రొమాటో థెరఫీ' (chromatotherapy; chromato = colour) అన్న వైద్య విధానానికి బీజావాపన జరిగింది. ఈ ప్రక్రియ ప్రకారం నేడు ఆర్కిటెక్ట్‌లు గోడలకు రంగులు, బాత్‌రూమ్ టెయిల్స్‌కు సంబంధించిన డిజైన్లు చేస్తున్నారు. అలాగే ప్రకృతి చికిత్సాలయాల్లో (నేచర్ క్యూర్) కూడ రంగుల చికిత్సా విధానాన్ని అవలంబిస్తున్నారు.

ఈ నేపథ్యంలో రంగులు, మనసుపై వాటి ప్రభావం, ఆయా రంగులను ఇష్టపడేవారి మనస్తత్వం తెలుసుకుందాం. రంగులు కొన్ని గుణాలకు, మానవస్వభావాలకు ప్రతీకలుగా భావింపబడుతున్నాయి. తెలుపు శాంతికి, నలుపు విచారానికి చిహ్నాలని అందరికీ తెలిసిందే. అలాగే, గులాబీరంగు శుద్ధమైన అనురాగానికి; నీలం భక్తి భావానికి, ప్రశాంతికీ; గోధుమ రంగు స్వార్థానికి; సింధూరపు రంగు ఆగ్రహానికీ; ముదురు ఎరుపు ఇంద్రియ లోలత్వానికీ, ఉద్రేకానికీ; బూడిదరంగు భయానికి ప్రతీకలు. ఆయా రంగులు మన హృదయంలో ఆయా సంవేదనల్ని కలిగిస్తాయి. మిశ్రమ వర్ణాలు మిశ్రమ సంవేదనల్ని కలిగిస్తాయి. ఉదాహరణకు ఎరుపు-నీలాల మిశ్రమ వర్ణం ఊదాను తీసుకుంటే, ఈ వర్ణంలోని ఎరుపు ఉద్రేకాన్నీ, నీలం ప్రశాంతినీ కలిగించడం వల్ల, మొత్తంగా ఊదారంగు ఉద్రేకం, ప్రశాంతీ కలగలిపిన సంవేదనలను కలిగిస్తుంది. ఎరుపు ఉద్రేకపరుస్తుంటే, నీలం శాంతపరుస్తుంది. అందుకే ఊదా రెండు విరుద్ధ సంవేదనలతో సంఘర్షణ కలిగించే రంగు. అందువల్ల ఊదా మనసులో అలజడిని కలిగిస్తుంది. రెండు విరుద్ధ సంవేదనలు కలిగించే మిశ్రమ వర్ణాలు మనం నిత్యం చూసే విధంగా ఉంటే, ఆ మిశ్రమ వర్ణంలోని ఆంశిక వర్ణాల ప్రభావం పై విధంగా అలజడి లాంటి సంవేదనలను కలిగిస్తుంది. అందువల్ల ఇంటీరియర్ డెకరేషన్‌లో అటువంటి రంగుల సమ్మేళనాలను (colour combination) పరిహరించడం మంచిది.

కొన్ని మిశ్రమ వర్ణాలు మంచి ఫలితాలనిస్తాయి. ఉదాహరణకు ఎరుపు-పసుపుల నారింజ రంగు. నారింజలోని ఎరుపు అగ్నికీ, పసుపు కాంతికీ సంకేతాలు. అగ్ని పెచ్చదనానికి, కాంతి జ్ఞానానికీ చిహ్నాలు. అందువల్లనే హిందూ సంప్రదాయంలో సాధువులు కాషాయరంగు బట్టల్ని ధరిస్తారు. అలాగే, ఋషులు, ప్రవక్తల చుట్టూ ఉండే తేజో మండలాన్ని (nimbus or aureola) నారింజ రంగులో చిత్రిస్తారు. నారింజ రంగును చూస్తున్నప్పుడు - ఎరుపు వల్ల కలిగే ఉద్రేకం, వెలాతెలా బోయే పసుపురంగు కలిగించే నీరసత్వం ఒకదాన్నొకటి సరిచేసుకుని (balance) ఒక కమనీయమైన భావనను మనసుకు అందిస్తుంది.

**ఇప్పుడు ఒక్కొ రంగు ప్రభావాన్ని పరిశీలిద్దాం**

**ఎరుపురంగు :** ఉద్రిక్తతకు, ఉద్వేగానికీ ప్రతీకయిన ఈ రంగును యిష్టపడేవారు స్వీయ నియంత్రణలో ఉంటారు. నాయకత్వ లక్షణాలను కలిగి, ఆధిక్య ధోరణిని ప్రదర్శిస్తారు. విమర్శలను వీరు నిబ్బరంగా తీసుకోలేరు. కలుపు గోలుతనమున్నా, తమ వ్యక్తిగతానికి వచ్చేసరికి, ఆధిక్యాన్ని చాటుకునే ప్రయత్నం చేస్తారు. మనిషి ఆరాపై ఈ రంగు ప్రసరిస్తే, అధిక ఉత్తేజం, ఉద్వేగం, శక్తి లభిస్తాయని క్రోమాటో థెరపీ ద్వారా రుజువైంది. డిప్రెషన్‌కు గురైనా, మానసిక శక్తి బలహీనపడినా, ఎరుపును ఎక్కువగా వాడడం వల్ల ప్రయోజనముంటుంది. అలాగే ఎర్రరంగు పళ్ళు - యాపిల్, టొమేటో మొదలైనవి తినడం మంచిది. ఇలాంటి వారు ఇంటి వాతావరణాన్ని అరుణమయం చేసుకోవడం మంచిది.

ఈ రంగు లక్షణాన్ని బట్టే విప్లవకారులు, అతివాదులు ఈ రంగును ఎక్కువగా ఇష్టపడడం, వాడడం జరుగుతుంది. శ్రీశ్రీ తన గేయాల్లో ఎర్రెర్రని ప్రతీకలైన పులి చంపిన లేడి నెత్తురు, కలకత్తా కాళిక నాలుక, కణకణ మండే త్రేతాగ్ని, అగ్ని కిరీటపు ధగధగలు, ఎర్ర బావుటా నిగనిగలు, హోమ జ్వాలల భుగభుగలు మొదలైనవి వాడడం ద్వారానే రక్తాన్ని సలసల కాగించే ఉద్రేకాన్ని తన కవిత్వంలో సాధించగలిగాడు.

ఆరోగ్యపరంగా చూస్తే, అధిక రక్తపోటు ఉన్నవారు ఎర్రరంగు బట్టల్ని వాడకూడదు. పరిసరాలలో ఎరుపురంగును ఉంచుకోకూడదు. వీరు లేత రంగు దుస్తులు, వస్తువులు, ముఖ్యంగా లేత నీలం, ఆకుపచ్చ రంగులవి వాడడం మంచిది. ఇన్‌ఫ్రారెడ్ కిరణాల్ని వాపులు నొప్పులు తగ్గించడానికి వైద్యులు ఉపయోగిస్తారు.

**నీలం రంగు :** ఆధ్యాత్మిక ప్రశాంతికి చిహ్నమైన ఈ రంగును యిష్టపడేవారు సున్నితమైన మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. సంక్షోభ సమయాల్లో సైతం ప్రశాంత చిత్తంతో ఉండగలుగుతారు. భావావేశాలను, ఉద్వేగాలను బంధించి ఉంచే శక్తి వీరిలో అధికం. వీరిలో నిర్మలత్వం, విశ్వాసపాత్రత గోచరిస్తాయి. ఈ రంగును ఆరాలో కలిగినవారు ఆధ్యాత్మికమైన స్వస్థతను, శాంతిని (spiritual healing) కలిగించగలుగుతారు. అందుకే క్రిస్టియన్ మత పరంగా తెలుపుతోపాటు, నీలం రంగును వాడతారు. మదర్ థెరెసాను, ఆమె ధరించిన నీలం రంగు అంచున్న ధవళ వస్త్రం, శాంత మూర్తిగా మన కట్టెదుట నిలుపుతుంది. ఆంతరంగికంగా శాంతమైన ఆమె స్వభావం, బాహ్యంగా ఆమె ధరించే బట్టలతో ద్విగుణీకృతమవుతోంది.

నీలం చాలా కామ్‌గా, కూల్‌గా ఉండే రంగు కావడం వల్ల ఆసుపత్రుల్లో ప్రత్యేకంగా ఈ రంగును, అందునా, లేలిక రంగును (tint) ఉపయోగిస్తారు. మందకొడిగా ఉండే మెతక స్వభావులు నీలం రంగు దుస్తులు ధరించడం మానాలి. అదే ప్రతి చిన్న విషయానికీ చీకాకు పడే కోపిష్టి స్వభావులు ఈ రంగును వాడడం మంచిది. దుస్తులతోపాటు నీలం రంగు బెడ్‌షీట్లు, కర్టెన్లు, తువ్వాళ్ళు వాడడం మంచిది.

ఆరోగ్యపరంగా కూడా నీలం రంగుకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఈ రంగు కళ్ళ ఆరోగ్యానికి మంచిది. ఈ రంగు శ్వాసక్రియను మెరుగు పరుస్తుంది. వివిధ గ్రంధులు అనారోగ్యానికి గురైనప్పుడు వాటి మీద నీలం రంగు కాంతిని ప్రసరింపజేస్తే స్వస్థత చేకూరుతుంది.

నేరేడు పండు రంగు కూడా నీలం రంగుతో ఏకీభవిస్తుంది. ఈ రంగు కూడా ఆధ్యాత్మిక చింతనను పెంచి, మానసిక జాగృతిని కలిగిస్తుంది. జీవితం పట్ల ఆరోగ్యకరమైన తాత్త్విక ఆలోచనలను కలిగించే రంగు. ఈ రంగును ఆరాలో కలిగి ఉన్నవారు దైవభావనతోను, ఆధ్యాత్మిక చింతనతోను ఉంటారు.

**పసుపురంగు :** ఈ రంగు ఆశావహ దృక్పథాన్ని సూచిస్తుంది. ఈ రంగును యిష్టపడేవారు సమస్యల్లో సైతం సంయమనాన్ని ప్రదర్శిస్తారు. వీరు గాసిప్స్‌ను యిష్టపడినా, తార్కిక విశ్లేషణ కలిగి ఉంటారు. మనిషి మెదడులో అధికమైన అనుకంపనలను (వైబ్రేషన్స్) కలిగించే రంగుయిది. పసుపు రంగు ఊహాశాలిత్వాన్ని, ఏకాగ్రతను ప్రేరేపించి, మానసిక శక్తిని పెంచుతుంది. డిప్రెషన్ వంటి మానసిక సమస్యలున్నప్పుడు ఈ రంగును వాడడం మంచిది.

**ఆకుపచ్చరంగు :** ఈ రంగును యిష్టపడేవారు అన్ని విషయాలలోను సమభావాన్ని, సామరస్యాన్ని చూపుతారు. సర్దుబాటు మనస్తత్వం ఎక్కువగా ఉండే వీరు ఇతరుల పట్ల దయను, కరుణను ప్రదర్శిస్తారు. వాదనలంటే వీరికి ఆసక్తి మెండు. అయినా నిర్ణయాలు తీసుకోవడంలో నిదానంగా వ్యవహరిస్తారు. ఆడంబరం, అతిశయం నచ్చని వీరు నీతి నియమాలకు కట్టుబడి ఉంటారు.

ఈ రంగు ఆరాలో ఉన్నవారు సహనశీలురు. నీలం రంగువలె యిదీ కామ్‌గా, కూల్‌గా ఉండే రంగు కావడంవల్ల ఈ రంగు మనసును రిలాక్స్‌డ్‌గా ఉంచుతుంది. మానసిక ప్రశాంతత, నిర్మల మనసు కావలసిన వారు ఈ రంగును వాడడం మంచిది. పచ్చిక బయలును, గరికను చూసినపుడు మనసు ఆనంద పారవశ్యం పొందడం అందరికీ అనుభవంలోనిదే కదా! ఈ రంగు గుండె, కళ్ళ ఆరోగ్యాన్ని పెంచుతుంది.

**నారింజ రంగు :** ఈ రంగును యిష్టపడేవారు తమ మాటలతోను, చేతలతోను ఇతరులను సులువుగా ఆకర్షించ గలుగుతారు. కల్లాకపటం తెలియని మాట. హాస్యపూరిత దృక్పథం వీరిని ఇతరులతో తొందరగా కలిసేలా చేస్తాయి. వీరు నిత్యం ఆనందంగా కనిపిస్తారు. ఇతరులు కూడా తమపట్ల అలా ఉండాలనుకుంటారు. ఒకవేళ ఇతరుల వల్ల ఏమైనా తేడా వస్తే వెంటనే నిస్పృహ చెందుతారు.

ఈ రంగు ఆరాలో ఉన్నవారు మానసిక శక్తి సంపన్నులుగా ఉంటారు. మూత్రపిండాల సమస్యలు ఈ రంగుతో నయమవుతాయి.

**నలుపురంగు :** ఈ రంగును యిష్టపడేవారు విలక్షణ మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. ఆడంబరంగా ఉండడం, ఆధునికంగా కనిపించడం వీరి లక్ష్యంగా ఉంటుంది. అయితే వీరు ఇతరులతో కలివిడిగా ఉండలేరు. ఈ రంగు ఆరాలో ఉన్నవారు ద్వేషాసూయలను, పగ, కార్పణ్యాలతోను రగిలిపోతూ ఉంటారు.

ఈ రంగు మంచిది కాదు. విచారానికీ, నిరసనకు ప్రతీక. అందుకే సమ్మె చేసేటప్పుడు, నిరసన వ్యక్తం చేసేటప్పుడు నల్లరంగు బ్యాడ్జీలను ధరిస్తారు. నిరసన దినాన్ని 'బ్లాక్ డే'గా వ్యవహరిస్తారు.

మన చుట్టూ ఉన్న రంగులు ఈ విధంగా మనపై ఎంతో ప్రభావం చూపుతాయి. అందుకే మనకు యిష్టమైన రంగులు, మన నడవడిని తీర్చి దిద్దేలా, మానసిక ప్రశాంతిని, స్పష్టతను కూర్చేవీ, ఉత్తేజం కలిగించి ఆహ్లాదాన్నిచ్చేవీ అయిన రంగుల ఎంపిక విషయంలో ఎంతో శ్రద్ధ అవసరం.



**ప్రజా రక్షకుడు - బైరన్**

బైరన్ 1809-10లలో గ్రీసును యాత్రికుడుగా సందర్శించిన తరవాత గ్రీకుల స్వాతంత్రోద్యమానికి సానుభూతి పరుడయ్యాడు. దీనిని అతడు ఈ చిత్రంలో ఉన్న జాతీయ వస్త్రధారణతో వ్యక్తీకరించాడు. అతని కొట్టవచ్చే అందం, ఉంగరాలు తిరిగిన రాగి జుత్తు, నీలి నేత్రాలు, పాలిన రంగు - అతడిని "నాయక-పూజ" (Hero-Worship) అందుకొనేట్టు చేసింది. గ్రీకులు అతనిని రక్షకునిగా పూజించారు.

MISIMI/ మిసిమి RNI Regd. No.45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd.No.



## గుఱ్ఱం మీదకు పులి దాడి

ఇది నీటి రంగుల చిత్రం. ఇది అతనికి 'వర్ణఛాయల' (Tonel effects) గాఢత, తీవ్రతల మీద ఉన్న నిపుణతను బహిర్గతం చేస్తుంది. ఈ చిత్రాన్ని 1825లో చిత్రించాడు. గుఱ్ఱంమీద పులి దాడి చేయడంలోని హింసా తీవ్రతను 'వెలుగు-ఛాయల'ను నిపుణతతో చిత్రించడం వల్ల ఆ జంతువుల కండరాల ఎత్తుపల్లాల తీవ్రత కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది.